"ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ,
ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక,
సరదాగా యిది చెయ్యాలింక"— ఫెవీ ఫెయిరీ

"ఇంద్రజాలం కానే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
దబ్బాలోనూ పనిమే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ వస్తువైనా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మరికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మైనా చేసెయ్యింక"

కిట్టీ కేట్ (కొంటెపిల్లి) ఎలా తయారుచెయ్యాలో అనే తీరుని ఉచితంగా పొందటం కోసం యీ కూపన్‌ను పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి:
"ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020

కిట్టీ కేట్ (కొంటెపిల్లి) ఎలా తయారుచెయ్యాలో అనే తీరుని ఉచితంగా పొందటం కోసం కూపన్‌ను "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020 చిరునామాకు పోస్టు చెయ్యండి.

పేరు ____________________
వయసు ____________________
చిరునామా ____________________
నగరం ____________________
రాష్ట్రం ____________ పిన్ ____________

మీకు మా వస్తువులో 'ఫెవీ క్రాఫ్ట్' అందిందా ? అవును/కాదు (C)

ఫెవికాల్® ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్




బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది
ఫెవికాల్ ఎమ్ ఆర్ అంటేనే అది

® ... బొంబాయి 400 021 ...

OBM-4103 TEL

# మీ ప్రియాతి ప్రియమైన బిడ్డకు ప్రత్యేకమైన సబ్బు కావద్దూ!

ప్రపంచమంతటిలోకీ సుతిమెత్తని పట్టులాంటి చర్మం మీ బిడ్డది. అంతటి నాజూకైన చర్మానికి మామూలు సబ్బులా సరిపోగలదు!

మామూలు సబ్బులు పెద్దవారికోసం తయారైనవి. అందుచేత వాటితో పిల్లల లేత చర్మాలకు సరైన సంరక్షణ లభించజాలదు.

11-12 ఏళ్లలోపు వయసుగల పిల్లల చర్మాల సంరక్షణకై ఇప్పుడు వచ్చింది బబుల్స్. ఇదొక సౌమ్యమైన కొత్త సబ్బు. పిల్లలకోసం ప్రత్యేకించి తయారుచేయబడిన సబ్బు.

బబుల్స్‌లోని ప్రత్యేకత ఏమిటి?

బబుల్స్, మీరు మీ బిడ్డకోసం ఎలా తయారుచేసి ఉండేవారో అచ్చంగా అంతే జాగ్రత్తగా తయారుచేయబడినది. అంటే, శుద్ధమైన పోషక తైలాల సమ్మిశ్రణం, మమత నిండిన మాతృస్పర్శలోని సౌమ్యత ఇందులో ఉన్నాయి.

బబుల్స్ మీ బిడ్డ చర్మాన్ని అది ఉండవలసిన రీతిలో, అంటే సహజమైన సమతూనికతో నిలిపి ఉంచుతుంది.

బబుల్స్ యొక్క సమృద్ధమైన నురగలో సంతోషంగా స్నానం చేయాలనీ, ఆడుకోవాలనీ మీ బిడ్డ మరీ మరీ కోరుతాడు.

బబుల్స్ ప్రపంచమంతటిలోకీ అతి ప్రత్యేకమైన కారణంగా తయారైనది. మీ బిడ్డ కోసమే తయారైనది.







పిల్లలకోసం ప్రత్యేకమైన సబ్బు
బబుల్స్–12 ఏళ్లలోపు వయసుగల పిల్లలకోసం.

everest/84/WIL/489-Tl

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["రాయిప్రభావం"] కు ఆధారం, కె. కె. రావు రచన. మనిషి ఏ కార్యాన్ని సాధించాలన్నా, దానికి ఎంతో ఓర్పూ, పట్టుదలా అవసరం. కేవలం ఆత్రం, తొందరపాటుకొద్దీ దుందుడుకు పద్ధతుల ద్వారా దాన్ని సాధించ చూడడం, మొదటికే ముప్పుకలిగిస్తుంది. "ఆత్రగాడి మంత్రసిద్ధి" అన్న కథలో, యీ విషయం తెలుసుకుంటాం.

## అమరవాణి

పరాన్ తోషయితు ర్దాతుః, న కదాపి ధనక్షయః,
ఉద్ధృతేపి నదీకూపాత్, జలే తస్య న హి క్షయః.

[ఇతరులకు దానం చేసినంతమాత్రాన, దాతకు సంపద తరిగిపోదు. ఏటి చెలమలో నీరు తోడితే, తిరిగి ఊరుతుందే గాని, ఎండిపోదుగదా!]

సంపుటి 76 జనవరి '85 సంచిక 1

విడి ప్రతి : 2-00 :: సంవత్సర చందా : 24-00






# చందమామ కబుర్లు



## తొలి రాష్ట్రపతి శతజయంతి

స్వతంత్ర భారతదేశ ప్రథమ అధ్యక్షుడు బాబురాజేంద్రప్రసాద్ 1884 వ సంవత్సరం బీహార్‌లో జన్మించారు. 1984 ఆయన శత జయంతి సంవత్సరం. చక్కగా సాగుతూన్న న్యాయవాద వృత్తిని వదిలిపెట్టి ఆయన స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. మూడు సార్లు జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులుగా వున్నారు. స్వాతంత్ర్యానంతరం 1950 సంవత్సరంలో దేశాధ్యక్షులయ్యారు. 1952 లోనూ, 1957 లోనూ మళ్ళీ అదే పదవికి ఎన్నుకోబడ్డారు.

## ప్రపంచంలో కెల్లా పెద్ద కేక్




కెనడాలోని హైగేట్‌కు చెందిన జిమ్ హిల్టన్ అనే వ్యక్తి ప్రపంచంలో కెల్లా పెద్ద కేక్‌ను తయారుచేశాడు. 400 కి॥ గ్రా॥ బరువైన ఈ కేక్ తయారీకి ఆయన—సిమెంట్ మిక్సర్, క్రేన్ మొదలైన పరికరాలను ఉపయోగించవలసివచ్చింది. ఆ కేక్‌ను రెండు వేల మంది తిన్నారు. జిమ్‌హిల్టన్ ఇంతకుముందు ప్రపంచంలో కెల్లా పెద్ద ఐస్‌క్రీమ్ కూడా తయారుచేశాడు.

## నేర్చుకోవడం ఎప్పుడు మొదలవుతుంది?



మాతృగర్భంలో ఉన్నప్పుడే శిశువు నేర్చుకోవడం ఆరంభిస్తుందని అమెరికాకు చెందిన శాస్త్రవేత్తలు చెబుతున్నారు. ఈ సిద్ధాంతం ప్రకారం—మన మహాభారత గాథలో అభిమన్యుడు తల్లి సుభద్ర కడుపులో వున్నప్పుడే, తండ్రి అర్జునుడు తల్లికి తెలియజేసిన యుద్ధవిద్యల గురించి విని నేర్చుకున్నాడంటే ఆశ్చర్యంలేదు కదా!

## మీకు తెలుసా?

1. ఐక్యరాజ్య సమితి ప్రథమ సమావేశం ఎప్పుడు, ఎక్కడ జరిగిందో మీకు తెలుసా?
2. కనిష్కుని రాజధానీ నగరమైన పురుష్‌పురం ఏ పేరుతో ప్రసిద్ధమయింది?
3. కాంచీపురం రాజధానిగా దక్షిణ భారతాన్ని పరిపాలించిన రాజులు ఎవరు?
4. ఢిల్లీనగర నిర్మాణానికీ, పేరుకూ సంబంధం వున్న మౌర్య పాలకుడు ఎవరో మీకు తెలుసా?
5. సుల్తాన్ సికిందర్‌షా లోడీ నిర్మించిన సుప్రసిద్ధ నగరం ఏదో మీకు తెలుసా?

(సమాధానాలు 64 వ పేజీలో)



# మేక - మేత

గోవిందయ్య చిన్నప్పటి నుంచీ బాగా కష్టపడి చాలా డబ్బు సంపాయించాడు. అయినా, ఆయన డబ్బు అనవసరంగా ఖర్చు పెట్టడు. అందరూ ఆయన్ని మంచి పొదుపరి అనేవాళ్ళు.

ఇప్పుడు గోవిందయ్యకు అరవై ఏళ్ళు దాటింది. ఆయన తన పనులన్నీ మరెవరి మీదో పెట్టక, స్వయంగా తానే చేసుకునే వాడు. ఆయన భార్య కూడా అంతే. పోతే, ఆయన ముగ్గురు కొడుకులూ పరమ సోమరులు. వాళ్ళు దేనికీ తండ్రి చెప్పిన మాట వినేవాళ్ళు కాదు.

గోవిందయ్యకు ఇరవై ఎకరాల మాగాణీ భూమి వున్నది. దగ్గిరుండి వ్యవసాయం చేసుకునే ఓపిక లేక, కొడుకుల సాయం కోరాడు. రోజూ పొలం వెళ్ళి రావడం నానా శ్రమ అనుకుని, వాళ్ళు భూమిని గ్రామంలోని మరొక రైతుకు అప్పగించారు. ఆ రైతు పండిన పంటలో చాలావరకూ తనే వుంచుకుని, తనకు తోచినది తెచ్చి గోవిందయ్యకు యిస్తూండే వాడు.

అలాగే, గోవిందయ్య తన వడ్డీవ్యాపారాన్ని చూసుకోలేక వేరే గుమాస్తాను పెట్టుకోవలసి వచ్చింది. తనకున్న బట్టల దుకాణాన్ని కూడా, ఆయన ఎరిగిన వాళ్ళకు అప్పచెప్పి, వాళ్ళిచ్చిన లాభం తీసుకుంటున్నాడు. ముగ్గురు కొడుకులూ మూడు పనులూ చూసుకుంటూ వుంటే, ఆయనకు నిశ్చింతగా వుండేది. కాని, వాళ్ళకు డబ్బు ఖర్చు చెయ్యడం తప్ప, మరొక పని మీద ధ్యాస లేకపోవడంవల్ల, గోవిందయ్యకు దిగులుగా వుండేది.

గోవిందయ్య ఇంటి చుట్టూ చాలా ఆవరణ వున్నది. అన్ని పనులూ మాని వేసి ఇంట్లో కూర్చున్నప్పటినుంచీ, ఆయన



ఆ ఆవరణలో రకరకాల మొక్కలూ, పాదులూ వేసి పెంచనారంభించాడు. కొంతకాలానికి ఇంటి చుట్టూ చక్కని తోట తయారయింది. మొక్కలకు పాదులు తవ్వడంలో కానీ, నీళ్ళు పోయడంలో కానీ కొడుకులు, గోవిందయ్యకు ఏ మాత్రం సాయపడేవాళ్ళు కాదు. పైగా, ఈ వయసులో కూడా యింకా సంపాయించాలన్న తాపత్రయం పోలేదని—తండ్రిని గురించి హేళనగా నవ్వుకునేవారు.

గోవిందయ్యకు తోట మీద కూడా మంచి ఆదాయం రాసాగింది. అక్కడ కాసిన కాయగూరలూ, పూసిన పూలూ క్షణాల మీద అమ్ముడు పోతూండేవి. అయితే, అనుకోకుండా ఆయనకు ఒక పెద్ద యిబ్బంది వచ్చి పడింది.

గోవిందయ్యకు పొరుగున కొత్తగా సోమనాథు డనేవాడు వచ్చి చేరాడు. వాడికి పాలవ్యాపారం వున్నది. వాడి దగ్గర ఇరవైదాకా మేకలున్నవి. మేకలకు వాడెలాంటి మేత పెట్టేవాడో తెలియదు కానీ, వాటి కన్ను గోవిందయ్య తోట మీద పడింది. రోజూ ఏదో సమయంలో అవి, ఆయన తోట మీద దాడిచేసి వెళ్ళిపోతూండేవి. తను ప్రాణప్రదంగా పెంచుకున్న తోట నాశనమైపోతూంటే చూడలేక, గోవిందయ్య కొడుకులను వంతుల వారీగా దాని కాపలా చూడమని బ్రతిమాలాడు. కొడుకులు ఆ విషయం పట్టించుకోలేదు.

ఇక లాభం లేదని గోవిందయ్య ఇంటి చుట్టూ బలమైన దడి కట్టించాడు. ఆ దడిలో రోజూ ఎక్కడో ఒకచోట కంత చేసి, మేకలు లోపలికి దూరుతూండేవి. ఇది పని కాదని, ఆయన దడికి అటూ, యిటూ ముళ్ళకంచె వేసి, తోట ద్వారానికి కర్రతలుపు పెట్టించాడు.

ఈ ఉపాయం కూడా కొన్నాళ్ళు మాత్రమే పనిచేసింది. తెలివి మీరిన మేకలు క్రమంగా తమ కొమ్ములతో కర్ర

తలుపును తెరవడం అలవాటు చేసుకున్నవి.

ఇక చేసేదిలేక గోవిందయ్య, సోమనాధుడికి తన గోడు చెప్పుకుని, "నీ మేకల్ని ఎలాగో ఒకలాగా అదుపు చెయ్యి," అన్నాడు.

"నీకైతే ముగ్గురు కొడుకులున్నారు. వాళ్ళే వాటిని అదుపు చెయ్యలేకపోతే, మా ఇంట్లో నే నొక్కడిని; ఎంతకని అదుపు చెయ్యగలను? మీరు తప్ప, నా మేకలవల్ల గ్రామంలో మరెవరూ యిబ్బంది పడడం లేదు," అన్నాడు సోమనాధుడు.



వాడు చెప్పిన దాంట్లో నిజమున్నదని, గోవిందయ్యకు అనిపించింది. ఆయన తోట ద్వారం దగ్గిర, మూడు గజాల పొడవున నిలువునా ఒక గొయ్యి తవ్వాడు. గోతికి అటూ, యిటూ బాటతో సమంగా ఎత్తయిన గట్లు పోశాడు. తరవాత గోతిని కప్పుతూ, గుండ్రని ఇనుప గొట్టాలు వరసగా పేర్చి బాటతో కలిపాడు. గుండ్రని ఇనుప గొట్టాల మీద మేకలకు కాళ్ళు స్థిరంగా నిలబడవు. అందువల్ల, అవి కష్టపడి కర్రతలుపు తీయగలిగినా, తోటలో ప్రవేశించ లేవు.

కొద్దిరోజులు గడిచాయి. మేకల బెడద గోవిందయ్యకు తప్పినట్టే వున్నది. కాని, ఒక రోజు మేక ఒకటి, ఇనుప గొట్టాల మీద కాళ్ళు పెట్టకుండా, మూడుగజాల దూరాన్ని దూకడానికి ప్రయత్నించి, గొట్టాలమీదపడి లేవలేకపోయింది. గోవిందయ్యవచ్చి, మేక పరిస్థితిచూసి జాలిపడి, దాన్ని ఎత్తుకుపోయి బయట వదిలాడు. కాని, మేకమాత్రం ఆయనమీద జాలిపడలేదు. అది ఆ తరవాత రెండు, మూడు ప్రయత్నాలు చేసి, చిట్టచివరకు ఒక రోజున, ఆ గొట్టాలమీది నుంచి తోటలోకి దూక గలిగింది.

ఆ మేక, తోటలో అందిన మొక్కల్లా తింటూంటే, గోవిందయ్య అక్కడికి వచ్చాడు. జరుగుతున్నది చూసి కూడా

ఆయన చలించలేదు. తనకేమీ పట్టని వాడిలా అలా నిలబడి చూస్తూండి పోయాడు.

ఇంతలో అక్కడికి ఆయన ముగ్గురు కొడుకులూ వచ్చి, "నాన్నా, నీ ప్రాణానికి ప్రాణమైన తోటను మేక తినేస్తున్నది. అలా చూస్తూ వూరుకున్నావేం? నువ్వు పడిన శ్రమంతా వృథా అయిపోయిందని నిరుత్సాహం కలిగిందా?" అని ఆశ్చర్యంగా అడిగారు.

గోవిందయ్య కొంచెంసేపు తల వూపుతూ వూరుకుని, "తిననివ్వండిరా! ఈ తోట దానికోసమే వేశాను. అది, యీ తోటను మేసేస్తే, అందువల్ల నేను చేసిన పాపాలన్నీ నశించడమేకాక, నాకు పుణ్యం కూడా వస్తుంది!" అన్నాడు.

ఆయన కొడుకులు ముగ్గురూ వింత పడిపోతూ, "నువ్వేమంటున్నావో అర్థం కావడం లేదు," అన్నారు.

"మేతకోసం, యీ మేక మూడుగజాల దూరం ఎంతోకష్టపడి దూకి లోపలికి వచ్చింది! ఎందుకూ పనికిరాని సోమరులను ఇంతకాలం పోషిస్తున్నందువల్ల నాకు వచ్చే పాపం, ఈ శ్రమజీవిని జాలి తలచడంవల్ల పోతుంది. ఈ రోజు నుంచీ నా డబ్బు, ఆస్తి అంతా ఎవరు శ్రమపడితే వారికే యివ్వదలిచాను," అన్నాడు గోవిందయ్య.

తమ ఆహారం సంపాయించుకునేందుకు, ఆ మేకపాటి శ్రమకూడా తాము చేయడం లేదని గ్రహించి, గోవిందయ్య కొడుకులు ముగ్గురూ ఎంతో సిగ్గుపడ్డారు. ఈ రోజు ఆ మేక మీద జాలిపడినట్టే, తమ తండ్రి రేపు ఏ దొంగ మీదనో జాలి పడవచ్చు. లేక ఏ పేదవాళ్ళ కష్టాలో చూసి, జాలిపడి వాళ్ళకు ఆస్తినంతా దానం చెయ్యవచ్చు!

ఈ భయం మనసుల్లో మెదలగానే గోవిందయ్య కొడుకులు తమ సోమరితనం మాని తండ్రి కోరిన విధంగా ఆయనకు సాయపడుతూ, గోవిందయ్యను సంతోష పెట్టారు.






## 3

[సూర్యవర్మ మరణించటం చూసిన సుబాహుడనే సేవకుడు, ఈ సంగతి సూర్యవర్మ కుమారుడైన చంద్రవర్మకు చెప్పేందుకు, బయలుదేరాడు. దారిలో అతడి గుర్రాన్ని సర్ప కేతుడి అనుచరులు చంపారు. అతడికి కాగడాలతో వున్న పల్లెవాసులు కనిపించారు. అంతలో కొందరు రౌతులు, 'హేయ్' అంటూ అతణ్ణి చుట్టుముట్టారు. తరవాత—]

సుబాహుడు ఒక్క తృటికాలం నిశ్చేష్టు డయాడు. తన అంతం సమీపించిందని కూడా అతడు భయపడ్డాడు. తన యజమాని మరణం సంగతి వీరపురంలో తెలియపరిచిన తరవాత, యిలాంటి ప్రమాదం వచ్చివుంటే అతడు ఏ మాత్రం లెక్కచేసి వుండేవాడు కాదు. ఈ క్షణాన తన చావు వీరపుర సంస్థానానికి కూడా ఎంతో వినాశకరంగా పరిణమిస్తుంది. దైవకృపవలన తను, యీ రౌతులను ఎలాగైనా మోసపుచ్చి పారి పోగలిగితే ఎంత బావుండును!

''ఏయ్, ఎవరు నువు? మాట్లాడవేం?'' అంటూ ఒక రౌతు సుబాహుణ్ణి సమీపించి, చేత్తో అతడి జుట్టు పట్టుకుని కుదిపాడు.

అంతలో జనంలోనుంచి ఒకడు, ''పాపం, ఆ బిచ్చగాణ్ణి హింసించకండి!




ఉపవాసాలతో మాటా పలుకూ పడిపోయి నట్టుంది!'' అన్నాడు జాలిగా.

ఆ మాటలతో సుబాహుడు తెప్పరిల్లాడు. తను మామూలు బిచ్చగాడుగా నటించటం ఏమంత కష్టం కాదని అతడికి ధైర్యం కలిగింది.

''బాబూ, యింత రొట్టెముక్క! యింత....'' అంటూ సుబాహుడు రౌతు కళ్ళలోకి జాలిగా చూస్తూ, గుర్రం కళ్ళాన్ని పట్టుకున్నాడు.

''ఛీ, యిదేం పీడ! ఎవడో వీరపురం వేగులవా డనుకున్నాను, ముష్టివెధవా!'' అంటూ రౌతు గుర్రాన్ని అదిలించి ముందుకు వెళ్ళాడు.

''వీడేం వేగులవాడు! శరీరంలో ప్రాణంవున్నట్టే లేదు. యీ చింకిగుడ్డలూ వీడూ....అరే, శనిగ్రహం! నీ వంటినే మోసుకోలేని వాడికి, చేతులో ఆ లావు దుడ్డుకర్ర ఎందుకు?'' అన్నాడొక రౌతు హేళనగా.

''కొండల్లో చిరుతపులుల్నీ, తోడేళ్లనీ బెదర కొట్టేందుకు, దొరా,'' అన్నాడు సుబాహుడు తడుముకోకుండా.

ఈ జవాబు వింటూనే రౌతులతోపాటు, జనంలోనుంచి కూడా కొందరు పొట్టలు చెక్కలయేలా నవ్వారు. ''ఎంత గొప్ప వేటగాడివిరా నువు! కాలు తీసి కాలు పెట్టే ఓపిక లేనివాడివి చిరుతపులుల్నీ తోడేళ్ళనీ బెదరకొడతావా?'' అన్నారు వాళ్ళు.

''ఇంత రొట్టెముక్క పెట్టించండి, దొరా! తరవాత నా ప్రతాపం చూద్దురు గాని. వారం రోజులుగా పచ్చి మంచి నీళ్ళతో బతుకుతున్నాను,'' అన్నాడు సుబాహుడు.

రౌతులు యీ మాటలేవీ వినిపించుకో లేదు. వాళ్ళు గుర్రాలను ముందుకు వురికిస్తూ, ''మీరు త్వరగా రాకాసిదిబ్బ దగ్గిరకు చేరాలి. అక్కడ మీకు కావలసిన ఆయుధాలు యివ్వబడతై. తెల్లవారే లోపల వీరపురం మన గుప్పెట చిక్కు




తుంది. సర్పకేత రాజుకూ, జై!'' అంటూ వెళ్ళిపోయారు.

సైనికులు వెళ్ళగానే, జనంలోనుంచి కొందరు ముందుకు వచ్చి, సుబాహుణ్ణి చుట్టుముట్టారు. వాళ్ళల్లో ఒకడు సుబాహుడితో, ''ఏరా అబ్బీ! చూట్టానికి యువకుడిలాగే కనబడుతున్నావు. కాలూ చేయీ కూడా బాగానే వున్నట్టున్నది. అలాంటి వాడికి బిచ్చం ఎత్తుకునే కర్మ ఎందుకు పట్టింది?'' అన్నాడు.

''అది తెలుసుకునేందుకే, యీ కొండల మీద వున్న ఒక గురువును అయిదేళ్ళనుంచి సేవిస్తున్నాను, దొరా! ఆయనకు యిన్నేళ్ళుగా నా మీద దయ కలగలేదు. ఇంతకు ఒక గంట ముందుగానే ఆయన ప్రసన్నుడై కొండ మీద నుంచి, కాగడాలతో వున్న మీ అందరినీ చూపిస్తూ, 'ఇవ్వాళ తెల్లవారే లోపల నిన్ను యింతకాలంగా పట్టి పీడిస్తున్న శని వదిలిపోతుంది. అంతేకాదు, నీ వెంట వచ్చేవాళ్ళ శనికూడా విరగడ అవుతుంది. అదుగో, ఆ కనబడే కాగడాల దగ్గిరకు వెళ్ళు!' అని సెలవిచ్చారు. దానితో హుటాహుటిగా కొండ దిగి మీ దగ్గిరకు వచ్చాను,'' అన్నాడు సుబాహుడు.

సుబాహుడు యిలా చెప్పగానే చుట్టూ చేరిన వాళ్ళు ఒక్క క్షణకాలం ఆశ్చర్యసంభ్రమాలతో నోట మాట రాక తడబడి, అంతలోనే తెప్పరిల్లి, ''ఆ కొండమీద వుండే మహాపురుషుణ్ణి గురించి చాలా కాలంగా వినటమే గాని, చూసినవాళ్ళెవరూ లేరు. ఇవ్వాళ తెల్లవారేలోపల వీరపురాన్ని వశపరుచుకుని కొల్లగొట్టబోతున్నాం. దివ్యదృష్టి వున్నవాడు గనక, ఆయనకు ముందుగానే యిదంతా తెలిసి వుంటుంది. ఇక మనకు విజయం తప్పదు. త్వరగా బయలుదేరుదాం,'' అన్నారు.

ఆ వెంటనే కొందరు గ్రామంలోకి పరిగెత్తి సుబాహుడికోసం యిన్ని రొట్టెలూ, పాలూ తీసుకువచ్చారు. సుబాహుడు తృప్తిగా వాటితో కడుపు నింపుకున్న తర

వాత, అతడి ముందు కొత్తదుస్తులు పెట్టి, ఆ చింకిగుడ్డలు విప్పి, వాటిని ధరించ మన్నారు. అలాంటి దుస్తుల్లో తానెవరైందీ గుర్తించేవాళ్ళు వుండవచ్చని అనుమా నించిన సుబాహుడు, వాళ్ళకేసి ఆప్యా యత ఒలికేలా చూస్తూ, "మిత్రులారా! మీ దయకు కృతజ్ఞుణ్ణి. కాని యిప్పుడు నేనీ కొత్తదుస్తులు ధరించటం గురువు ఆజ్ఞను ధిక్కరించటం అవుతుంది. నన్ను పట్టి పీడిస్తున్న శని, యీనాటి సూర్యో దయంలోపల వదిలిపోతుంది. ఆ తరవాత వీటిని ధరిస్తాను," అన్నాడు.

ఆ వెంటనే, "జై...." అంటూ కొందరు ఒక్కసారిగా దిక్కులు పిక్కటిల్లేలా అరిచి, సుబాహుడి కేసి తిరిగి, "ఇంతకూ నీ పేరేమిటో మాకు తెలియలేదు!" అన్నారు.

"పేరా.... పేరు....!" అంటూ సుబా హుడు కొంచెం తడబడి. "తల్లిదండ్రులు పెట్టిన పేరు ఏదయితేం? శనిచేత యింత కాలంగా పీడింపబడుతున్న వాణ్ణి. గురువాజ్ఞ మేరకు అది వదలగానే......" అంటూండగానే, జనంలోనుంచి ఒకడు, "ఇవ్వాళతో మనందరి శనీ వదులు తుంది! ఈనాటి నుంచీ నీ పేరు శని మర్దనుడు," అన్నాడు. వెంటనే "శని మర్దనుడికీ, జై!" అన్న కేకలు మిన్ను ముట్టినై.

తరవాత అందరూ కాగడాల వెలుగులో రాకాసిదిబ్బ దగ్గిరకు బయలుదేరారు.



తనవెంట వున్నవాళ్ళు మాట్లాడుకునే దాన్నిబట్టి, వాళ్ళంతా కటిక దరిద్రులనీ, సర్పకేతుడు ధనధాన్యాలు దొరుకుతవని ఆశ కల్పించటంవల్లనే, వాళ్ళు వీరపురం కేసి బయలుదేరుతున్నారనీ గ్రహించాడు సుబాహుడు.

"నాకు వీరపురాన్ని గురించి బాగా తెలియదు. దాని సామంతుడైన సూర్యవర్మ అంత ప్రజాకంటకుడా?" అని సుబాహుడు జనంలో ఒకడిని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే అతడు నవ్వి, "ఈ సామంతుల్లో ప్రజాకంటకుడు కానివాడెవడు? సూర్యవర్మ సంగతి తెలియదు గాని, సర్పకేతుడి కన్న జనకంటకుడు మరొకడు పుట్టబోడు," అన్నాడు.

"అలా అయితే, వీరపురాన్ని దోచుకోవటానికి మనం ఎందుకు వెళ్ళాలి? ఆ విధంగా మనం సర్పకేతుడికి సాయం చేసినవాళ్ళ మవుతాంగద!" అన్నాడు సుబాహుడు.

ఆ సరికి వాళ్ళిద్దరి సంభాషణలో మరి నలుగురైదుగురు వచ్చి పాల్గొన్నారు. వాళ్ళు సుబాహుడి ప్రశ్నకు వింతగా నవ్వి, "మనం సర్పకేతుడికి సహాయం చేయటానికి వెళ్ళటం లేదు. వీరపురాన్ని కొల్లగొట్టేందుకు అతడు సహాయం చేస్తానన్నాడు. మనం అక్కడినుంచి తెచ్చుకోగలిగినదంతా మనదే; అందులో అతడికి గానీ, అతడి సైనికులకుగానీ పాలుండదు," అన్నాడు.






వెలుగుతున్న పెద్ద పెద్ద కాగడాలున్నవి. వాళ్ళందరినీ కొందరు సైనికులు సోలుపులుగా నిలబెడుతున్నారు. సుబాహుడు వున్న ముఠాను కూడా ఒకచోట నిలబెట్టారు.

ఆ తరవాత దళనాయకుల దుస్తుల్లో వున్న కొందరు అశ్వికులు ముందుకు వచ్చి, అక్కడ చేరిన జనాన్ని వుద్దేశించి యీ విధంగా చెప్పారు :

"మహా శక్తిసంపన్నుడూ, దయామయుడూ అయిన సర్పకేతు రాజు సహాయంవల్ల మీరు యీనాటితో దారిద్ర్య బాధనుంచి విముక్తులవుతారు. ఇప్పటి సమస్య ఏమిటంటే, వీరపుర పట్టణంలో ఎలా ప్రవేశించటమా అనేది. పట్టణ ద్వారపాలకుల్ని మోసగించి, ఒకసారి ద్వారాలు తెరిచేలా చేశామంటే, ఆ తరవాత మనకు పట్టణంలో అడ్డు నిలబడ గల శక్తి ఏమీ వుండదు. కనుక, మీలో ఒక వందమంది ముందుగా పట్టణ ద్వారాలను సమీపించి, హాహాకారాలు చేస్తూ, సర్పకేతురాజు సైనికులు మీ గ్రామాలమీద పడి దోచుకుంటూన్నట్టు ఆర్తనాదాలు చేయండి. ఆ కేకలకు కాపలావాళ్ళు ద్వారాలు తెరుస్తారు. వెంటనే మీరు పక్కకుతొలగి దారియిస్తే, పౌరదుస్తుల్లో వున్న మా సైనికులు

అమాయకత్వం, దురాశా కరుడు కట్టిన యీ పల్లెవాసులతో తను ఏం మాట్లాడినా లాభంలేదని సుబాహుడు గ్రహించాడు. వాళ్ళ దృష్టిలో తమను పాలించే సామంతులందరూ ఒకటే. వీలయినప్పుడల్లా ఇతరులు తమను దోచుకుంటున్నారు. అదేవిధంగా అవకాశం చిక్కితే తామూ యితర్లను కొల్లగొడతారు—అదీ ఈ పల్లెవాసుల మనస్తత్వం.

కొద్దిసేపటి తరవాత అందరూ రాకాసి దిబ్బ ప్రాంతానికి చేరారు. ఆ సరికే అక్కడ వందల సంఖ్యలో జనం చేరి వున్నారు. వాళ్ళల్లో చాలామంది దగ్గిర

పట్టణంలో జొరపడతారు. వారి వెనకగా ప్రవేశించి మీరు, మీ యిష్టం వచ్చినట్టు నగరాన్ని కొల్లగొట్టవచ్చు. మీరు మాత్రం. వీలయినప్పుడల్లా యశోవర్ధన మహారాజుకూ, జై అంటూ మాత్రం నినాదాలు చేస్తూ వుండాలి. యశోవర్ధన మహారాజు పంపగా వచ్చినవారని భ్రమపడి, సూర్యవర్మ సైనికుల్లో కొందరైనా మిమ్మల్ని ఎదుర్కొనేందుకు భయపడతారు. మిగిలినవాళ్ళను పొరదుస్తుల్లో వుండే మా సైనికులు హతమారుస్తారు. ఏ పరిస్థితుల్లోనూ మీరు సర్పకేతురాజు పేరు ఉచ్చరించరాదు.''



దళనాయకుల మాటలు ముగిసేలోపలే జనంలోనుంచి 'యశోవర్ధన మహారాజుకూ, జై!' అన్న కేకలు గట్టిగా వినిపించినై.

వీరపురాన్ని ఆక్రమించుకోవటానికి యింత నిగూఢమైన కుట్ర జరుగుతున్నదని అర్థం కాగానే సుబాహుడు నిర్విణ్ణుడయాడు. తను వీళ్ళనుండి విడివడి ముందుగా వీరపురం ప్రవేశించి చంద్రవర్మకు యీ మోసాన్నిగురించి తెలియపరచగలిగితే ప్రమాదం జరగకుండా అతణ్ణీ, నగరాన్నీ రక్షించవచ్చు. కాని, వీళ్ళందరి దృష్టి నుంచీ తప్పుకుని నగరంకేసి పారిపోవటం ఎలా?

సుబాహుడు యీ విధంగా ఆలోచిస్తున్నంతలో జనం మహాప్రవాహంలా ముందుకు కదిలారు. వాళ్ళలో చాలామంది పొరదుస్తుల్లోవున్న సర్పకేతుడి సైనికులని అతడు గుర్తించగలిగాడు. అందరికన్న ముందు పరుగులు తీస్తున్న ఓ వందమంది ప్రజలతో సుబాహుడు కలిశాడు. చూస్తూండగానే వాళ్ళు పట్టణ ద్వారాలను సమీపించారు. వెంటనే జనంలో కొందరు శోకిస్తున్నట్టుగా ఎలుగెత్తి, ''అయ్యా, ద్వారాలు తెరవండి! సర్పకేతుడి సైనికులు మా గ్రామాలమీద పడి కనపడిందల్లా దోచుకుంటూ, ప్రజలను హింసిస్తున్నారు. రాజుగారి నుంచి మాకు

వెంటనే సైనిక సహాయం కావాలి!'' అని కేకలు పెట్టారు.

పట్టణ ద్వారాల వెనకవున్న కాపలా వాళ్ళు, ద్వారాలు తెరవటమా మానటమా అని సందేహించేలోపలే, జనంలోనుంచి మరికొందరు భయకంపితులైన వాళ్ళలా, ''అయ్యా, మాకు సూర్యవర్మ రాజులం వారే దిక్కు! స్వయంగా మా మొర వారికి చెప్పుకోనీయండి,'' అంటూ అరిచారు.

ఆ వెంటనే ద్వారాలు తెరవబడినై. అప్పటివరకూ వాటి దగ్గిర వున్నవాళ్ళు పక్కలకు తప్పుకున్నారు. మరుక్షణంలో పౌరదుస్తుల్లోవున్న సర్పకేతుడి సైనికులు, అప్పటివరకూ దాచివుంచిన ఆయుధాలు బయటికి తీసి కాపలావాళ్ళమీద పడి, చూస్తూండగానే కొందరిని చంపి, మిగతా వారిని ఖైదీలుగా పట్టుకున్నారు. జనం రణగొణధ్వని చేస్తూ ఒక్కుమ్మడిగా ముందుకు కదిలారు.

సుబాహుడు ఒక్క గంతులో ద్వారం దాటి, పెనుగులాడుతున్న కాపలావాళ్ళ పక్కనుంచి వేగంగా ముందుకు పరిగెత్తాడు. అదే సమయంలో వెనకనుంచి కేకలూ, చప్పట్లూ వినిపించినై. ''ఎవడా పరిగెత్తేది? జనం అంతా కలిసి కట్టుగా వెళ్ళాలి. పరిగెత్తండి, వాణ్ణి పట్టుకోండి!''

మరుక్షణం నలుగురైదుగురు సర్పకేతుడి సైనికులు, ''ఆగు, ఆగు!'' అంటూ సుబాహుడి వెంటబడ్డారు. తను, చావో బతుకో తేల్చుకోవలసిన సమయం ఆసన్నమయిందని సుబాహుడు నిశ్చయించుకుని, చెంగున వెనుదిరిగి, సమీపిస్తున్న సైనికుణ్ణి ఎగిరి డొక్కలో బలంగా తన్ని, వాడు వెనక్కు పడిపోయేలోపల, వాడిచేత గల కత్తిని లాక్కున్నాడు. ఇంతలో మరొక సైనికుడు అతణ్ణి సమీపించాడు. సుబాహుడు తన కత్తితో వాణ్ణి బలంగా గుండెల్లో పొడిచి, మరికొందరు సైనికులు రావటం గమనించి, తక్కున వెనుదిరిగి రాజప్రాసాదం కేసి పరిగెత్త సాగాడు. —(ఇంకావుంది)






## బేతాళ కథలు

# రాయి ప్రభావం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, యింత అర్ధరాత్రివేళ, భీతికొలిపే శ్మశానంలో నువ్వుపడుతున్న శ్రమకు కారణం, ఏదో అలౌకికశక్తి అయి వుంటుందని, నాకు అనుమానం కలుగుతున్నది. ఎంత పట్టుదలా, ధైర్యసాహసాలూ కలవాడైనా, మనిషి తాను కోరినవన్నీ సాధించలేడు; అందుకు సాయపడే, అడ్డుపడే బాహ్య శక్తులు కొన్ని వుంటవి. ఉదాహరణగా నీకు, లక్ష్మీధరు డనే ఓడ వర్తకుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

లక్ష్మీధరుడనే వర్తకుడు, పెద్ద పెద్ద పెట్టుబడులు పెట్టి, విదేశాలకు ఓడల



ద్వారా సరుకులు రవాణా చేసేవాడు. ఈ వ్యాపారంలో అతడు లక్షలు గడించాడు. అయితే, అనుకోకుండా యిందులో ఒకసారి అతడికి విపరీతమైన నష్టం కలిగింది. సముద్రపు దొంగలు ఓడలను అటకాయించి, కొల్ల గొట్టుకు పోయారు.

ఈ సంగతి తెలిసి అతణ్ణి పరామర్శించ వచ్చిన మిత్రుడొకడు, అతడి చేతివేళ్ళ కేసి కన్నార్పకుండా కొంతసేపు చూసి, ''పగడం తాపిన ఆ ఉంగరం ఎప్పుడు చేయించావు ?'' అని అడిగాడు.

''బావున్నదని ముచ్చటపడి, ఈ మధ్యనే చేయించాను. ఎందుకలా అడిగావు ?'' అన్నాడు లక్ష్మీధరుడు.

''పగడం నీకు అచ్చివచ్చేదేనా, లేక కాకతాళీయంగా వేయించావా?'' అన్నాడు మిత్రుడు.

''ఈ అచ్చిరావడం సంగతి, నాకు తెలియదు. పగడం బావున్నదని వేయించా. అసలు నన్ను పరామర్శించవలసింది పోయి, యీ ప్రశ్నలన్నీ ఎందుకడుగుతున్నావు ?'' అన్నాడు లక్ష్మీధరుడు.

''ఈ రాయిప్రభావం కారణంగానే, నువ్వు వ్యాపారంలో అంతగా నష్టపోయావు. ఆ సంగతి బాగాగుర్తుంచుకో!'' అని లక్ష్మీధరుడి మిత్రుడు వెళ్ళిపోయాడు.

మిత్రుడు యిలా అన్నప్పటి నుంచీ లక్ష్మీధరుడి మనస్సులో ఒక పెద్ద అనుమానం చోటు చేసుకున్నది. అతడు తల పండిన పదిమంది పరిచయస్థుల్ని కలుసుకుని, పగడపు రాయిగురించి వాకబు చేశాడు. వాళ్ళంతా ఏక కంఠంగా. ''లక్ష్మీధరా, ఒక్కొక్క మనిషికి, ఒక్కొక్క రాయి అచ్చివొస్తుంది. ఇది జగమెరిగిన సత్యం!'' అన్నారు.

దానితో లక్ష్మీధరుడి అనుమానం భయంగామారింది. పొరుగునవున్న ఊళ్లో, ఆభరణాలూ వాటికి విలువైన రాళ్ళను విక్రయించే సోమశేఖరుడనే వర్తకుడున్నాడు. అతడు ఎవరికి ఎలాంటి రాయి అచ్చివచ్చేదీ ముందేతెలుసుకుని విక్ర

యిస్తాడు. ఈ సంగతి విన్న లక్ష్మీధరుడు అతణ్ణి చూడబోయాడు.

సోమశేఖరుడు, లక్ష్మీధరుడు చెప్పినదంతా మౌనంగా విని, ఉంగరంలోని పగడపు రాయిని ఏదో పనిముట్టుతో లాఘవంగా ఊడబెరికి, పక్కనవున్న చెత్తకుండీలో పారవేశాడు. తరవాత అతడి నామనక్షత్రాలు తెలుసుకుని వేళ్ళతో గుణించి, పక్కనేవున్న ఒక చిన్న పెట్టె మూత తెరిచాడు.

అ పెట్టెలోవున్న రాళ్ళలో నీలపురంగు నుంచి ఒక రాయిని ఏరితీసి, దాన్ని నేర్పుగా లక్ష్మీధరుడి ఉంగరంలో పొదిగి అతడి చేతికిచ్చాడు.



''ఇది జాతినీలంరాయి! మీరు అన్నివేళలా ధరించతగ్గది. దీని ప్రభావం ముందు, ముందు మీరే స్వానుభవంతో తెలుసుకుంటారు. దీని ఖరీదు చాలా ఎక్కువే. అయినా మీరు చెప్పింది విన్న తరవాత, వ్యాపారంలో బాగా నష్టపడ్డారని గ్రహించాను. అందుకే, లాభపడకుండా, నష్టపోకుండా దీన్ని మీకు కేవలం వెయ్యివరహాలకే యిస్తున్నాను,'' అన్నాడు సోమశేఖరుడు.

లక్ష్మీధరుడు మారు మాట్లాడకుండా వెయ్యి వరహాలూ సోమశేఖరుడి కిచ్చి, ఇంటికి తిరిగివచ్చాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు సోమశేఖరుడి దుకాణానికి లక్ష్మీధరుడు వచ్చాడు. అతణ్ణి చూస్తూనే సోమశేఖరుడు, ''ఇప్పుడు నీలంరాయి ప్రభావం ఎలా వున్నది?'' అని అడిగాడు.

''దాని ప్రభావం, నా మీద పనిచేసినట్టులేదు. మరొకసారి చాలా పెద్ద నష్టం కలిగింది,'' అన్నాడు లక్ష్మీధరుడు.

''ఏరూపంలో ఎంతనష్టమో, వివరంగా చెప్పండి,'' అన్నాడు సోమశేఖరుడు.

లక్ష్మీధరుడు విచారంగా, ''ఏం చెప్పేది! నేను సరుకులతో పంపిన నాలుగు ఓడల్లో ఒకటి పెనుతుఫానులో చిక్కుకుని మునిగిపోయింది. జరిగిన



నష్టం బేరీజువేస్తే—షుమారు యాభై లక్షలవరహాలవుతుంది,'' అన్నాడు.

సోమశేఖరుడు నవ్వి, ''అంటే, మిగిలిన మూడు ఓడలూ సురక్షితంగా ఒడ్డు చేరాయన్నమాట. అవునా?'' అన్నాడు.

''అవును, చేరినై,'' అన్నాడు లక్ష్మీధరుడు.

''నేనిచ్చిన నీలంరాయి ప్రభావం వల్ల, మీకు శుభమే జరిగింది. ఆసంగతి మీరు గుర్తించడం లేదు. నాలుగు ఓడల్లో మూడు, అంత పెద్ద తుఫాను దెబ్బకు తట్టుకుని, సలక్షణంగా తీరం చేరాయంటే, ఏమన్న మాట? అది, ఆ రాయి ప్రభావం! అలాకాకపోతే, నాలుగు ఓడలూ సముద్రగర్భంచేరి, మీరీపాటికి బికారిఅయి వుండేవాళ్ళు,'' అన్నాడు సోమశేఖరుడు.

లక్ష్మీధరుడు మారు మాట్లాడకుండా, ఉంగరాన్ని తీసి సోమశేఖరుడి కిచ్చి, ఇంటి దారిపట్టాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, ''రాజా, లక్ష్మీధరుణ్ణి ఆ ఉంగరంలోని రాయి, అతడి ఓడల్లో మూడు సముద్రంపాలు కాకుండా కాపాడింది. ఆ సంగతి సోమశేఖరుడు అతడికి స్పష్టంగా చెప్పాడు కూడా. అయినా, లక్ష్మీధరుడు, ఆ మాటలను అర్థం చేసుకున్నట్టులేదు. అందువల్ల ముందు, ముందు అతడు ఓడవర్తకంలో మరింతగా నష్టపోయే అవకాశం వున్నది. లక్ష్మీధరుడు ఉంగరాన్ని సోమశేఖరుడికి యిచ్చివేయడం కేవలం అజ్ఞానంవల్లనే కదా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''లక్ష్మీధరుడు మొదట్లో బావున్నదని ముచ్చటపడి పగడంతాపిన ఉంగరం చేయించుకున్నాడు. అప్పట్లో అతడికి ఉంగరంలోని రాయికి ఏదో ప్రభావం వుంటుందని చాలామంది నమ్ముతారని తెలియదు. ఆ రాళ్ళకు ఏవో అలౌకిక శక్తిని అంటగట్టి, లక్ష్మీధరుడికి అందులో నమ్మకం కలిగించినవాడు,

అతడి మిత్రుడు. సముద్రంలో తుఫానులు లేవడం ప్రకృతిసహజం. ఆ సమయంలో అక్కడవున్న ఓడలు కొన్ని దాని ధాటికి మునగడం, కొన్ని సురక్షితంగా ఒడ్డు చేరడం కూడా సహజమే.

అయితే, సోమశేఖరుడు చాలా తెలివి మంతుడైన వ్యాపారి. అప్పటికే అంతో, యింతో ఉంగరం రాళ్ళ ప్రభావం గురించిన నమ్మకం వున్నవాడు తప్ప, లేనివాడు తన దగ్గిరకు రాడని అతడెరుగు. ఆ నమ్మకాన్ని తన తర్కంతో, మాటకారితనంతో, అతడు మరింతగా వృద్ధిపరుస్తాడు. తుఫానులో చిక్కిన నాలుగుఓడల్లో, ఒకటి నీటమునిగి మూడు సురక్షితంగా తీరం చేరడం, రాయిప్రభావ మంటూ అతడు లక్ష్మీధరుడి చేత నమ్మించ చూశాడు. దానితో లక్ష్మీధరుడికి, ఆ వ్యాపారి కుతర్కం అర్థమైంది. మరేదైనా ఒకనాడు తుఫానులో తన ఓడలన్నీ మునిగినవని చెబితే - అతడు కాలగమనం వల్ల నీలంరాయి ప్రభావం పోయిందని చెప్పి, మరొక రంగురాయిని తన చేత కొనిపించవచ్చు. అసలు యిదంతా, తాను మొదట ధరించిన పగడంతాపిన ఉంగరంతో ప్రారంభమైంది! దాని ఆధారంతో మిత్రుడు, తన మనసులో ఎన్నడూలేని ఒక మూఢ విశ్వాసానికి విత్తనం వేశాడు. ఏ కారణం చేతనైనా మనిషిలో ఆత్మ విశ్వాసం నశించినప్పుడే, అతడు మూఢ విశ్వాసాలకు లొంగిపోతాడు. అది మనిషిని సర్వనాశనం వైపుకు నడిపే ప్రమాదం వున్నది. ఓడవ్యాపారి అయిన తను, యిలాంటి వాటికి, యింతటితో స్వస్తి పలకకపోతే, మరెన్నోరకాలైన అనర్థ విశ్వాసాలకు దాసుడు కావలసివస్తుంది. ఇలా ఆలోచించే లక్ష్మీధరుడు, ఉంగరాన్ని సోమశేఖరుడికి యిచ్చివేశాడు. అలా చేయడం అజ్ఞానంవల్లకాదు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగంకలగగానే, బేతాళుడు శవంతో సహామాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# అతిధోరణి

భద్రశీలుడనే ధార్మికుడు, ఊరూరా తిరిగి సత్య, ధర్మాలనుగురించి జనులకు సులభగ్రాహ్యమైన ఉపన్యాసాలిస్తూండేవాడు. ఆయనవద్ద కంకణుడు, లోహకుడు అనే యిద్దరు శిష్యులుండేవారు. వృద్ధాప్యం ముంచుకొస్తూన్నందువల్ల, భద్రశీలుడు తరచు అనారోగ్యంతో బాధపడుతూండేవాడు. అలా అస్వస్థతగా వున్నప్పుడు, ఆయన ఉపన్యాసమిచ్చే బాధ్యత కంకణుడికి అప్పగించేవాడు.

ఇంత కాలమైనప్పటికీ గురువు ఒక్క పర్యాయం కూడా జనంముందు నిలబడి, ఉపన్యాసం యిచ్చే అవకాశం తనకివ్వక పోతూండడం, లోహకుణ్ణి ఎంతగానో బాధపెట్టేది.

ఒకరోజు అతడు భద్రశీలుణ్ణి, "గురువర్యా! నాకున్న ధర్మశాస్త్ర పరిజ్ఞానం తక్కువయినా అయివుండాలి, లేక నా శుశ్రూషలో లోపమేదైనా వుండి తీరాలి. అలాకాకపోతే, తమకు కంకణుడి పట్ల గల పక్షపాతమైనా కావచ్చు! మీరు జనులకు, నా ధర్మశాస్త్ర పరిచయాన్ని ప్రదర్శిస్తూ మాట్లాడడానికి యింతవరకూ, ఒక్క అవకాశం కూడా యిచ్చినారు కాదు," అని అడిగాడు.

ఇందుకు భద్రశీలుడు మందహాసం చేసి, "నీకు ధర్మశాస్త్రాల్లో ఎంతటి పరిచయమున్నదో, నాకు తెలియందికాదు. చెప్పాలంటే నువ్వు, కంకణుడికన్న మరి కొంచెం ఎక్కువ చదివినవాడివే!" అన్నాడు.

గురువు యిలా అనగానే లోహకుడికి చాలా సంతోషంకలిగింది. భద్రశీలుడు కొంచెం ఆగి, "సామాన్యులకు శాస్త్రాల్లోని ధర్మ విషయాలను గురించి, మనస్సుకు హత్తుకు పోయేలా మనం చెప్పగలగాలి.

జొన్నలగడ్డ రత్న

అలా చెప్పలేనప్పుడు, వాళ్లు విపరీతార్థాలు తీసుకుని, మనం ఆశించిన దానికి భిన్నంగా ప్రవర్తించే ప్రమాదంవున్నది. నువ్వు, ఉపన్యాసకుడిగాకన్న విమర్శకుడిగా, వ్యాఖ్యాతగా రాణిస్తావని, నాఅభిప్రాయం,'' అన్నాడు.

లోహకుడు ముఖం చిన్న బుచ్చుకుని, ''ఇన్నేళ్ళుగడిచినా ఒక్క అవకాశం కూడా, నా కెప్పుడూ యివ్వకుండానే, తమరు నా గురించి యిలా అభిప్రాయపడడం, నా దురదృష్టంగా భావిస్తాను,'' అన్నాడు.

భద్రశీలుడు కొంచెంసేపాలోచించి, ''సరే! నీలోవున్న అపోహల్ని తొలగించడానికి, యీ రాత్రే నేను సిరిపురం శివాలయంలో యివ్వవలసిన ఉపన్యాసం, నీ చేత యిప్పిస్తాను. అందుకు సిద్ధంగా వుండు,'' అన్నాడు.

గురువు యిలా అనగానే లోహకుడికి చాలా సంతోషం కలిగింది. ఆ రాత్రి సిరిపుర శివాలయ ప్రాంగణంలో, లోహకుడు గ్రామస్థుల ముందు నిలబడి, 'ధనమూలమిదంజగత్' అన్నవిషయాన్ని ఖండిస్తూ, ఉపన్యాసం ప్రారంభించాడు.

మనిషి సుఖంగా బతకడానికి డబ్బు ప్రధానం కాదని, లోహకుడు ఎన్నో ఉదాహరణలిస్తూ, ఒక గంటకాలంగా మాట్లాడుతూ వస్తున్నాడు. అతడి ధోరణి అక్కడ చేరిన జనానికేకాక, భద్రశీలుడికి కూడా వినుగుపుట్టిస్తున్నది.



అలా కొంతసేపు జరిగాక, లోహకుడు ఒకక్షణం ఆగి, జనాన్ని ఉద్దేశించి, ''డబ్బుతో మనం అన్నీ కొనలేమని, మీ అందరికీ యీపాటికి అర్థమయిందను కుంటాను,'' అన్నాడు.

జనంలో కొందరు, ''మహ బాగా అర్థమైంది!'' అని, యిక ఉపన్యాసం ముగించమన్నట్టు గట్టిగా చప్పట్లుకొట్టారు.

లోహకుడు అదేం గమనించక రెట్టించిన ఉత్సాహంతో, ''డబ్బుతో మనం సంతోషాన్ని కొనగలమా? ఆప్యాయతకు విలువ కట్టగలమా?'' అని, జనంలో ముందు కూర్చున్నవాడి నొకణ్ణి లేవమని, ''నాయనా, నేను, నీకు వందవరహాలిచ్చి, నీ తల్లిదండ్రుల్ని అసహ్యించుకోమని చెబితే, అలా చేయగలవా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు వాడు అయోమయంగా దిక్కులు చూడసాగాడు. అంతలో వాడి పక్కన కూర్చున్నవాడు లేచి నిలబడి, "మా మేనమామనుఅసహ్యించుకోమంటే, నాకెలాంటి అభ్యంతరమూలేదు. ఇందుకు, నాకెంత డబ్బు ముట్టచెపుతారు?'' అని అడిగాడు.

జనం అంతా గొల్లున నవ్వి, ఒక్కొక్కరే లేచి పోసాగారు. లోహకుడు అలాగే స్థాణువులా ఆశ్చర్యంతో నిలబడి పోయాడు.

అప్పుడు భద్రశీలుడు, లోహకుడి భుజంతట్టి, ''ఉపన్యాసం యివ్వడానికి, యింతకాలంగా నేనెందుకు అవకాశం యివ్వలేదో ఇప్పుడు అర్థమైందా? నీకు అధికమైన శాస్త్ర పరిజ్ఞానంతోపాటు, అతి ధోరణి కూడా వుండడమే అందుకు కారణం. నిన్నుగురించిన, నా అంచనాలో పొరబాటేంలేదు గదా?'' అని అడిగాడు నెమ్మదిగా.

లోహకుడు గురువుకు జవాబివ్వలేక తలవంచుకున్నాడు. ఆ తరవాత అతడు ఉపన్యాసాల జోలికిపోక, ధర్మశాస్త్రాలకు చక్కని వ్యాఖ్యలు రాసి, మంచి పేరు తెచ్చుకున్నాడు.





# పరిచారిక నవ్వు

శివపురి, స్వర్ణపురి యిరుగు పొరుగు రాజ్యాలు. వాటి మధ్య తాతలనాటి తగాదాలుండడంతో చాలాకాలం ఎడ ముఖం, పెడముఖంగా వుండేవి. రెండు రాజ్యాలూ, ఆర్థికపరంగానూ, సైనిక బలంలోనూ సమానమైనవే.

ఇలావుండగా క్రమేపీ స్వర్ణపురి సైనికంగా బలహీనమైంది. అప్పుడు, స్వర్ణపురి రాజు విష్ణుసేనుడు, శివపురి నుంచి రానున్న యుద్ధ ప్రమాదాన్ని గురించి ఆలోచించాడు.

శివపురి రాజు శివసేనుడికి యుక్త వయస్కుడైన ఒక కుమారుడున్నాడు. విష్ణుసేనుడికి రత్నమంజరి అనే సౌందర్యవతి అయిన కుమార్తె వున్నది. తన కుమార్తెను, శివసేనుని కుమారుడికిచ్చి వివాహం చేస్తే, ఇక అటునుంచి యుద్ధ ప్రమాదమే వుండదు.

ఇలా ఆలోచించి విష్ణుసేనుడు, తను శివసేనుడితో వియ్యమంద దలచినట్టు దూతద్వారా వర్తమానం పంపాడు. అప్పటికే శివసేనుడి కుమారుడు విజయుడు రత్నమంజరి సౌందర్యాన్ని గురించి విని, ఆమెను వివాహమాడాలనుకుంటున్నాడు. అది ఎరిగిన శివసేనుడు, విష్ణుసేనుడి వర్తమానం విని, ఒప్పుకున్నాడు.

వివాహానికి ముందు శివసేనుడు, అన్ని వివరాలూ మాట్లాడుకునేందుకు విష్ణుసేనుణ్ణి ఆహ్వానించి విందు ఏర్పాటు చేశాడు. విందుకు విష్ణుసేనుడితో పాటు ఆయన భార్య జయంతీదేవి, కుమార్తె రత్నమంజరీ వచ్చారు. పరిచారికలు విందుకు వచ్చిన వారందరికీ వివిధరకాల వంటకాలు వడ్డన చేస్తున్నారు. ఆ సమయంలో మాలతి అనే పరిచారిక వడ్డన చేస్తూ, పక్కున నవ్వింది. ఆ నవ్వు విని

ఎస్. శివనాగేశ్వరరావు



విష్ణుసేనుడి ఆలోచనలు వేరే విధంగా వున్నవి; శివసేనుడి నుంచి రాబోయే యుద్ధప్రమాదం శంకించి, యుద్ధంలో ఓడిపోతానని తాను భయపడివుండాలి. అందుకే, వియ్యంపేరుతో ఆయన్ని మంచి చేసుకుంటున్నాడు, యీ రాజు—అని పరిచారిక నవ్విందని, విష్ణుసేనుడు ఉలిక్కిపడి ముఖం ముడుచుకున్నాడు.

విష్ణుసేనుడి భార్య జయంతీదేవికి తెల్ల శిరోజాలు కనిపించకుండా, నల్లరంగు వేసుకోవడం అలవాటు. విందుకు వచ్చే హడావిడిలో, ఆమె రంగు వేసుకోవడంలో అంత శ్రద్ధ చూపించలేదు. అందువల్ల తను శిరోజాలకు రంగువాడే విషయం గమనించి, పరిహాసంగా నవ్వుతున్నదేమో పరిచారిక అని, ఆమె ఉలిక్కిపడి సిగ్గుతో ముఖం దించుకున్నది.

మాటిమాటికీ రాకుమారుడు విజయుడి వంక క్రీగంట చూస్తున్న రాకుమార్తె రత్నమంజరి, యీ సంగతి పరిచారిక గ్రహించి నవ్విందేమో అని ఉలిక్కిపడి, తల పక్కకు తిప్పుకున్నది.

ఇక విజయుడి ఉలికిపాటుకు కారణం మరొకటి: అతడు, రాకుమార్తెతో ఏకాంతంగా మాట్లాడాలని, తన మిత్రుడితో ఆమెకు కబురు పంప చూస్తున్నాడు. ఈ సంగతి పసిగట్టి పరిచారిక నవ్వి

అందరూ ఉలిక్కిపడ్డారు. ప్రతి ఒక్కరి ఉలికిపాటుకూ ఒక్కొక్క కారణంవున్నది:

విష్ణుసేనుడి నుంచి కట్నకానుకల రూపంలో, ఏమేమి రాబట్టాలన్న సంగతి భార్యతో మంతనాలాడిన శివసేనుడు, "ఇంత ధనమున్న రాజుకూ, ఇంకా ధనం సంపాయించాలన్న ఆశే!" అని పరిచారిక నవ్విందని ఉలిక్కిపడ్డాడు.

శివసేనుడి భార్య శారదాదేవికి కొంచెం నత్తి. ఆడపెళ్ళివారి వద్ద ఆ సంగతి బయట పడకుండా వుండడం కోసం, ఆమె అందరితోనూ ముభావంగా వుండసాగింది. ఈ సంగతి గమనించి పరిచారిక నవ్విందేమో అని ఆమె ఉలిక్కిపడింది.

వుంటుందని, అతడు ఉలిక్కిపడి మౌనం వహించాడు.

శివసేనుడి మంత్రి సుధర్ముడు సునిశిత గ్రాహి. ఆయన విందుభోజనం చేస్తున్న వారందరిలోనూ హఠాత్తుగా వచ్చిన మార్పు యిట్టే గ్రహించాడు. పరిచారిక మాలతి నవ్వుకు ప్రతి ఒక్కరూ ఏదో కారణం ఊహించుకుని మథన పడుతున్నారని ఆయన ఊహించాడు.

కొంత సేపటికి విందు ముగిసింది. సుధర్ముడు, మాలతిని దగ్గిరకు పిలిచి, "విందు మధ్యలో నువ్వు నవ్విన నవ్వుకు కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

మాలతి తమగురించే చెబుతుందేమో అని, ప్రతివారూ ఆమెకేసి కోపంగా చూడసాగారు. కాని, మాలతి తన నవ్వుకు కారణం చెప్పడానికి సంకోచించ సాగింది.

అప్పుడు సుధర్ముడు, "చూడు, మాలతీ! నీ నవ్వుకు, యిక్కడ వున్న వారు ఏదో కారణం ఊహించుకుని బాధపడే అవకాశం వున్నది. నే నూహిస్తున్న దేమంటే—నువ్వు, నీకు సంబంధించిన ఏదో విషయం జ్ఞప్తికివచ్చి నవ్వివుంటావని. ఎందుకంటే మమ్మల్ని చూసి నవ్వేంత ధైర్యం, పరిచారికవైన నీకుండదు. నువ్వు నవ్వినకారణం చెప్పి తీరాలి!" అన్నాడు.

మాలతి కొంచెం సిగ్గుపడుతూ, "మా ఆయనకు మతిమరుపు ఎక్కువ. కొత్త గాజులు తెమ్మని ఎన్నిరోజులుగా చెబుతున్నా మరిచిపోతున్నాడు. ఇది పని కాదని, ఇవ్వాళ—మరిచిపోకుండా కొత్త గాజులు తేవాలి అని చెప్పి, నా పాత గాజులు కొన్ని అతడి చేతికి తగిలించాను. మతిమరుపాయన ఆ సంగతి మరిచి, గాజులచేతితోనే అంతఃపురం కాపలాకు వచ్చాడు," అని, పహరాకాసే మల్లయ్యను చూపించింది.

మల్లయ్య చేతికి వున్న గాజులు చూస్తూనే, పరిచారిక నవ్వుకు కారణం, అందరికీ అర్థమైపోయింది. దానితో అందరూ అనుమానాలు తీరిపోయి హాయిగా నవ్వేశారు.





# నమ్మక ద్రోహి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో అయిదు వందలమంది వర్తకులు ఒక నౌకలో సముద్రం మీద పోతూ ఉండగా, నడిసముద్రంలో నౌక మునిగిపోయింది. నౌకలో ఉన్నవారిలో ఒకడు తప్ప అందరూ చేపలకు ఎర అయారు. అందరూ చావగా మిగిలినవాడు కరంబియ అనే సముద్రతీర నగరాన్ని చేరుకుని తిండికోసమూ, బట్టకోసమూ ముష్టి ఎత్త సాగాడు.

అక్కడి ప్రజలు వాడి దుస్థితికి జాలిపడి సమస్తమైన వస్తువులు వాడికి ఇవ్వబోయారు. "ఇవన్నీ నాకెందుకు? నాకింత బట్టా, తిండీ చాలు!" అని వాడు, వారిచ్చిన వస్తువులను నిరాకరించాడు. ఇది చూసి ప్రజలు, "ఓహో, ఇతడెవడో గొప్ప విరాగి, తపస్వి!" అనుకుని, అతని కొక పర్ణశాల నిర్మించి, అందులో ఉంటూ తపస్సు చేసుకోమన్నారు.

అతను అందులో ఉంటూ, కరంబియ మహాముని అని పేరుపెట్టుకుని, ఎంతో గౌరవ ప్రపత్తులు సంపాదించుకున్నాడు. అతని దర్శనం కోసం రాజులు కూడా రాసాగారు. ఈ విధంగా కరంబియుడి స్నేహం సంపాదించిన వారిలో పాములకు రాజైన పండరకుడూ, గరుడులకు రాజుగా జన్మించిన బోధిసత్త్వుడూ ఉన్నారు.

ఒకనాడు గరుడరాజు వచ్చి, కరంబియుడికి ప్రణామం చేసి, పక్కనే కూచుని "స్వామీ, మా గరుడులకూ, పాములకూ యుద్ధం జరిగినప్పుడల్లా పాములకన్న గరుడులే ఎక్కువగా చావటం జరుగుతున్నది. మాకు పాములను ఎలా పట్టాలో తెలియటం లేదనుకుంటాను. ఇందులో ఏదో రహస్యం ఉన్నది. ఆ

రహస్యం ఏమిటో మీరు పాముల నుంచి తెలుసుకుని నాకు చెప్పగలరా?'' అని అడిగాడు.

కరంబియుడు సరే నన్నాడు. గరుడ రాజు వెళ్ళిపోయాడు. తరవాత సర్ప రాజు తనను చూడటానికి వచ్చినప్పుడు కరంబియుడు ఆయనతో, ''రాజా, గరుడులు మిమ్మల్ని పట్టుకోగానే చచ్చి పోతాయట. దీని కేమిటి కారణం? ఎలా పట్టుకుంటే మీ సర్పాలు లొంగి పోతాయి?'' అని అడిగాడు.



దీనికి సర్పరాజు వినయంగా జవా బిస్తూ, ''స్వామీ, అది మా రహస్యం. నేను గనక ఈ రహస్యాన్ని బయట పెట్టానో నా జాతి కంతకూ ద్రోహం చేసిన వాణ్ణి అవుతాను. జాతి వినాశనానికి కారకుడ నవుతాను! కనుక ఆ సంగతి నన్నడగకండి,'' అన్నాడు.

''అదేమిటి? రహస్యాన్ని మరొకరికి చెప్పేస్తానని నీవు నిజంగా శంకిస్తున్నావా? అలా ఎన్నటికీ జరగదు. నేను కేవలం ఆ రహస్యం ఏమిటో తెలుసుకుందామనే అడుగుతున్నాను. నాకు చెప్పినందువల్ల నీ జాతి కేమాత్రమూ నష్టం కలగదు,'' అని కరంబియు డన్నాడు.

సర్పరాజు కరంబియుడికి రహస్యం చెబుతానని మాట ఇచ్చి సెలవు పుచ్చు కున్నాడు. ఆయన తన దర్శనం కోసం మర్నాడు వచ్చినప్పుడు కరంబియుడు మళ్ళీ అడిగాడు, కాని సర్పరాజు రహస్యం బయట పెట్టలేదు. ఆయన మూడవసారి వచ్చినప్పుడు కరంబియుడు, ''ఇవాళ మూడవసారి అడుగుతున్నాను. మీ రహస్యం చెప్పవు, కారణమేమిటి?'' అని అడిగాడు.

దానికి సర్పరాజు, ''స్వామీ, తమరు ఈ రహస్యాన్ని మరెవరికైనా చెప్పేస్తా రేమోనని నాకు భయంగా ఉంది!'' అన్నాడు.

''నేనలా ఎన్నటికీ చెప్పను. చెప్ప నని ప్రమాణం చేస్తున్నాను!'' అన్నాడు



కరంబియుడు. అయన ప్రమాణం చేసిన మీదట సర్పరాజు తమ రహస్యాన్ని ఈ విధంగా బయటపెట్టాడు:

"మేము పెద్దపెద్ద రాళ్ళను మింగి మా శరీరాలను బరువుగా చేసుకుని పడుకుని వుంటాము. గరుడులు మామీదికి వచ్చినప్పుడు మేము నోళ్ళు తెరుచుకుని వారిమీద కలియబడతాము. గరుడులు మా తలలను పట్టుకుని గాలిలోకి ఎగురుతారు. మా బరువులు మోయటం చేత వారి శరీరాలలో వుండే నీరంతా పైకి వచ్చేస్తుంది. ఆ కారణంగా చచ్చిపోతారు. మూఢులైన ఆ గరుడులు మా తలలు పట్టుకోవటానికి బదులు మా తోకలు పట్టుకుని గాలిలోకి లేచినట్టయితే మేము మింగిన రాళ్ళన్నీ కింద పడిపోతాయి. మా శరీరాలు తేలిక అవుతాయి. మమ్మల్ని వారు తన్నుకుపోగలుగుతారు. ఇదే మా రహస్యం!"

సర్పరాజు వెళ్ళిపోగానే గరుడరాజు వచ్చి కరంబియుడితో. "స్వామీ, సర్పరాజు నుంచి పాముల రహస్యం తెలుసుకున్నారా?" అన్నాడు. కరంబియుడు సర్పరాజు నుంచి తాను తెలుసుకున్న రహస్యం కాస్తా గరుడరాజుకు చెప్పేశాడు.

"ఈ సర్పరాజు గొప్ప అపచారం చేశాడు. తన జాతి యావత్తూ నాశనం అయేటందుకు సహాయపడగల రహస్యాన్ని ఆయన మరొకరికి తెలియనిచ్చి వుండగూడదు. నే నిప్పుడే వెళ్ళి ఆయనను పట్టుకుంటాను," అంటూ గరుడరాజు తన రెక్కలతో ఝంఝామారుతాన్ని లేపి, సర్పరాజు తోకను పట్టుకుని ఆకాశంలోకి ఎగిరాడు.

తలకిందుగా వేలాడుతున్న సర్పరాజు తాను మింగిన రాళ్ల నన్నిటినీ కక్కేశాడు. ఆయన విచారంతో, "అయ్యో, నా నాశనాన్ని నేను కోరి చేతులారా తెచ్చుకున్నాను గదా! ఆ దుర్మార్గుడు మహాముని అని మోసపోయి, నా రహస్యం కాస్తా చెప్పేశాను," అని విలపించాడు.

ఇది విని గరుడరాజు, "మూర్ఖుడా, నీ రహస్యం ఆ దొంగసన్యాసికి చెప్పేసి ఇంకా ఎందుకు దుఃఖిస్తావు? చావు ఎవరికీ తప్పదు, కాని వివేకం మానవుడి ప్రధాన ధర్మం. నీ దుర్గతికి కారణం నేను కాను, సన్యాసీ కాడు, నీ అవివేకమే. ప్రాణికి తల్లిదండ్రులకన్న ప్రేమపాత్రులుండరు; అలాటి తల్లిదండ్రులకు కూడా నీ రహస్యం చెప్పరాదు. అనేకమంది బంధువులూ, మిత్రులూ వుంటారు, రూపవతి అయిన భార్య వుంటుంది; వారి కెవరికీ నీ రహస్యం తెలియనివ్వరాదు. ఆ విధంగా రహస్యం దాచగలిగిన వాడే శత్రువును దూరంగా ఉంచగలుగుతాడు!" అన్నాడు.

"మహాత్మా, నీ హితబోధ గ్రహించాను. తల్లి తన బిడ్డపైన ఎలాటి కరుణ చూపుతుందో నాపైన అలాటి కరుణ చూపు!" అని సర్పరాజు గరుడరాజును ప్రార్థించాడు.

"కొడుకులలో మూడు రకాలు; శిష్యులూ, పెంచినవారూ, గర్భవాసాన పుట్టినవారూ. అందులో నీవు నాకు శిష్యుడవు, కనుక కొడుకువయావు. అందుచేత నీ ప్రాణాన్ని కాపాడుతున్నాను!" అంటూ గరుడరాజు సర్పరాజును నేలమీదికి దించి వదలిపెట్టాడు.

సర్పరాజు నాగలోకానికి వెళ్ళాడు. గరుడరాజు తన లోకానికి వెళ్ళి గరుడులతో, "సర్పరాజైన పండరకుణ్ణి



మిత్రుడుగా చేసుకున్నాను. కాని అతనికి నా పట్ల ఎలాటి భావం ఉన్నదో పరీక్షించ వలసి వున్నది.'' అని చెప్పి, నాగ లోకానికి వెళ్ళి తన రెక్కలతో మళ్ళీ ఝంఝామారుతం లేపాడు. వెంటనే సర్పరాజు రాళ్లూ, ఇసుకా మింగి, తోక కనపడకుండా చుట్ట చుట్టుకుని నేలపై పడుకుని, నోరు తెరిచి బుసకొట్ట సాగాడు.

అప్పుడు గరుడరాజు, ''ఇదేమి, సర్ప రాజా? మనం సంధీ, స్నేహమూ చేసు కొంటిమిగదా, మళ్ళీ నన్ను చంపటానికి సిద్ధపడుతున్నా వేమిటి?'' అని అడిగాడు.

దానికి సర్పరాజు, ''మిత్రమా, వివేకి అయినవాడు ఎవరినీ నమ్మరాదు! అందులో, నిన్నటివరకూ శత్రువుగా ఉండిన నిన్ను ఎలా నమ్మను?'' అన్నాడు.

గరుడరాజు నవ్వి, ''నా పాఠం నాకు బాగానే వప్పగించావు! పద, ఆ దొంగ సన్యాసిని చూసివస్తాం!'' అన్నాడు.

ఇద్దరూ కలిసి కరంబియుడి పర్ణ శాలకు వెళ్ళారు. సర్పరాజు కరంబి యుణ్ణి చూసి, ''నిన్ను చూసి గొప్ప మునివనుకుని నా రహస్యం చెబితే, దాన్ని గరుడరాజుకు చెప్పి ఎందుకు నమ్మక ద్రోహం చేశావు?'' అని అడిగాడు.

''నేను అజ్ఞానంచేత ఆ పని చెయ్య లేదు. మీ రిద్దరూ నాకు మిత్రులే అయి నప్పటికీ నాకు గరుడరాజుపైన అభి మానం జాస్తి. అందుచేత నీ రహస్యం గరుడరాజుకు చెప్పేశాను!'' అన్నాడు కరంబియుడు.

''ఛీ, నీచుడా! సర్వసంగాలనూ పరిత్యజించి కూడా పక్షపాత బుద్ధి, శత్రు మిత్ర భావమూ పోని నీవు కూడా ఒక ముని వేనా? లోకాన్ని ఈ విధంగా వంచిస్తు న్నందుకు నీ శిరస్సు ఏడు చెక్కలగు గాక!'' అని సర్పరాజు కరంబియుణ్ణి శపించాడు.

మరుక్షణమే కరంబియుడు శిరస్సు ఏడు చెక్కలయింది. అతని కింద భూమి విచ్చుకున్నది. అతను నేరుగా అవీచీ నరకానికి దిగిపోయాడు.





మన నదులు :

# నర్మద

ఇది నర్మదానది పుట్టుకకు సంబంధించిన పురాణగాథ. మైకాల్ పర్వత ప్రాంతం అద్భుతమైన ప్రకృతి సౌందర్యానికి పుట్టినిల్లు. దాని పరిసరాల్లో మానవసంచారం వుండేది కాదు. దేవతలూ, యక్షులూ అక్కడికి తరచూ వచ్చేవారు. అక్కడి ప్రకృతి ప్రతి ఋతువులోనూ సరికొత్త అందాలు సంతరించుకొనేది.

ఒకసారి పరమశివుడు ఆ కొండ మీదికి వచ్చాడు. ప్రకృతి సౌందర్యానికి ముగ్ధుడై అక్కడే కూర్చుని ధ్యానమగ్నుడయ్యాడు. సంవత్సరాలెన్నో గడచినా శివుడు ఏమాత్రం చలించలేదు. శివుడి దివ్యసుందరరూపానికి ప్రకృతి పరవశించింది.





పరమశివుడి నుంచి వెలువడిన అద్భుతమైన దివ్యతేజస్సు, హఠాత్తుగా అందమైన కన్యకారూపం దాల్చింది. అమె శివునికి నమస్కరించి "తండ్రీ! ఎల్లప్పుడూ స్వేచ్ఛగా, ఆనందంగా వుండే వరం ప్రసాదించు," అని ప్రార్థించింది.



"అలాగే జరుగుతుంది," అని వర మిచ్చిన శివుడు, ఆమెకు నర్మద (నున్నిత హృదయ) అని నామకరణం చేశాడు. అప్పటి నుంచి ఆమె వివిధ పుష్పవనాలతో నిండిన, ఆ కొండల మీద వనదేవతగా, మలయమారుతంలా హాయిగా విహరించసాగింది.

లేళ్ళు, నెమళ్ళు మొదలైన వన్య ప్రాణులు ఆమెకు నేస్తాలయ్యాయి. వాటితో ఆమె కలిసిమెలిసి, దాగుడు మూతలు ఆడుతూ ఆనందంగా కాలం గడపసాగింది. అందమైన ఆ పర్వత ప్రాంతానికి ఆమె ఆటపాటలు మరింత శోభను సమకూర్చసాగినై.





అక్కడికి వచ్చిన దేవతలు నర్మదను చూసి, ఆమె అందానికి ముగ్ధులై ఆశ్చర్యం చెందారు. ఆమె వన్యమృగా లతో ఆడుకుంటున్నప్పుడు, ఆమెను కొండల చాటు నుంచి గమనించ సాగారు. ఆమె ఎక్కడికి వెళ్ళినా, దేవతలు చాటుగా ఆమె వెన్నంటి కనిపెడుతూ వచ్చారు.

కొంత కాలానికి దేవతలు ఆమెతో స్నేహం చేయకుండా వుండలేక పోయారు. ఆమె చేత ఆకర్షించబడి ఆమెను సమీపించసాగారు. అయినా వాళ్ళతో మాట్లాడడానికీ, వాళ్ళలో ఎవరి నైనా పెళ్ళాడడానికీ నర్మదకు ఏమాత్రం ఇష్టం లేదు. ఆమె ఎప్పుడూ స్వేచ్ఛగా వుండడానికే నిశ్చయించింది.





దేవతలు ఆమెను తరుమసాగారు. అయినా ఆమె మెరుపులా వారి నుంచి తప్పించుకోసాగింది. పర్వతాలలో ఒక వైపు నుంచి మరో వైపుకు దేవతలు ఆమెను వెంబడించారు. అయినా ఆమె వారి చేతికి అందకుండా తప్పించు కుంటూ వచ్చింది.

ఇలాకొంతకాలం జరిగినతరవాత,నర్మద పర్వత శిఖరాన్ని అధిరోహించింది. ఇక అక్కడి నుంచి ఆమె తప్పించుకో జాలదని భావించిన దేవతలు ఎంతో ఉత్సాహంగా ముందుకు పోయారు. నర్మద వాళ్ళకేసిఒక్కసారి చూసి, తర వాత కొండ అవతలి వైపుకు చూసింది. ఒక్క క్షణం అలాగే నిలబడింది.





హఠాత్తుగా ఆమె సెలయేరుగా మారి కొండకు అవతలి వైపు నుంచి ప్రవహించసాగింది. దేవతలు నిస్సహాయంగా అలాగే చూస్తూ వుండిపోయారు. నర్మద, నర్మదానదిగా మారి, కొండలూ, కోనలూ దాటి మైదానాల మీదుగా ప్రవహించి, బ్రోచ్ వద్ద సముద్రంలో కలిసింది. నర్మదానది మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్‌ల మీదుగా ప్రవహిస్తున్నది.

ప్రాచీనకాలం నుంచీ నర్మదానది అతి పవిత్రంగా భావించబడుతున్నది. ఆ నదీ తీరంలో ఋషులు తపస్సు చేశారు; భక్తులు నదీ పరిక్రమ చేస్తారు. అంటే- నర్మదా నది ఉద్భవించే అమర్ కంటక్ నుంచి ఒక గట్టు మీదుగా బ్రోచ్ వరకూ యాత్ర చేసి, అక్కడ నదిని దాటి మరో గట్టు మీదుగా, అమర్ కంటక్ చేరుకుంటారు.





అమర్ కంటక్ వద్ద నర్మదామాత ఆలయం వున్నది. వేలాదిమంది భక్తులు ఆలయాన్ని దర్శిస్తూ వుంటారు. అది గొప్ప యాత్రాస్థలంగా వెలుగొందుతున్నది.

# చందా వసూలు

వీరాపురం అనే గ్రామంలో, లక్ష్మయ్య అనే ఒక షావుకారు వుండేవాడు. అయన లోభుల్లో పరమ లోభి. ఆ కారణంగా, అందరూ ఆయన ప్రస్తావన వచ్చినప్పుడు లోభిలక్ష్మయ్య అనేవాళ్ళు.

ఒకసారి గ్రామస్థులందరూ, గ్రామంలో సత్రం ఒకటి కట్టించాలనుకుని, అందుకోసం చందాలు వసూలు చేయసాగారు. కాని, వాళ్ళకు లోభిలక్ష్మయ్య నుంచి చందా ఎలా వసూలు చేయాలో అర్థంకాలేదు.

ఆ గ్రామానికి కొత్తగా వచ్చి స్థిరపడిపోయిన ఒక కుటుంబంలో కామయ్య అనే యువకు డున్నాడు. వాడు మంచి తెలివైనవాడు, మాటకారి, ఏ పనైనా సాధించడంలో మంచి దిట్ట. వాణ్ణి గ్రామస్థులు కార్యసాధకుడంటూ పిలిచేవాళ్ళు.

వాడు మరిద్దరు యువకుల్తో, లోభి లక్ష్మయ్య దగ్గిరకుపోయి, సంగతి చెప్పి చందా అడిగాడు.

లక్ష్మయ్య ఆశ్చర్యంగా వాడికేసి చూస్తూ, "నేనా! చందా యివ్వడమా? ఇంతవరకూ నే నెవ్వరికి చందా యివ్వలేదు. నీకన్న ఘనులెందరో వచ్చి తిరిగి వెళ్ళిపోయారు," అన్నాడు.

ఆ జవాబుకు కామయ్య చిన్నగా నవ్వి, "అయ్యా, నేను వాళ్ళలా తెలివితక్కువ వాణ్ణి కాను. నన్ను అందరూ కార్యసాధకుడంటారు. ఎదుటి వాళ్ళల్లో ఏమాత్రం తెలివితేటలున్నా, వాళ్ళనుంచి చందా వసూలు చేయగలను!" అన్నాడు.

లోభిలక్ష్మయ్యకు చందా యివ్వక తప్పిందికాదు. —వక్కలంక "కిషోర్"





# వెన్నెల నిచ్చెన

శ్రీకృష్ణదేవరాయలు విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించే కాలంలో, విజయనగరంలోనే ఒక గజదొంగ బయలుదేరి రోజు కొక ఇంట్లో దొంగతనం చెయ్యసాగాడు. వాణ్ణి పట్టుకోవటానికి రాజుగారు చేయించిన ప్రయత్నా లేవీ చిన్నమెత్తయినా ఫలించలేదు.

ఈ దొంగను ఎలాగైనా పట్టుకోవాలని తెనాలి రామలింగడికి బుద్ధి పుట్టింది. అతను రోజు తప్పకుండా నలుగురు చేరిన చోటికల్లా వెళ్ళి, "ఈ గజదొంగ మా ఇంటి మీద ఎప్పుడు వచ్చి పడతాడోనని భయంగా ఉంది. ఎందుచేతనంటే మా నట్టింట్లో చాలా ధనరాసులున్నాయి!" అంటూ వచ్చాడు.

తెనాలి రామలింగడి ఇంట్లో చాలా ధనం ఉన్నదన్న సంగతి త్వరలోనే గజదొంగ చెవిని పడింది. వాడికా సంగతి తెలిసి ఏదో రాత్రి తన ఇంటికి రావాలనే తెనాలి రామలింగడి ఉద్దేశం కూడా. దొంగ తమ ఇంటికి వచ్చినప్పుడు ఏం చెయ్యాలో ఎలా మాట్లాడాలో రామలింగడు తన భార్యకు బాగా నూరిపోశాడు.

ఇంతలో ఒక రాత్రి గజదొంగ రామలింగడి ఇంటికి రానే వచ్చాడు. వాడి కోసం రాత్రిళ్ళు మేలుకుని వుంటున్న రామలింగడు, ఇంటి కప్పు మీద దొంగ కదులుతున్న అలికిడి వినగానే, పక్కన ఉన్న తన భార్యకు సైగచేశాడు.

వెంటనే ఆవిడ గొంతెత్తి, "ఏమండీ, దొంగాడు మనింటికి కూడా వస్తాడేమో? నాకు భయంగా వుంది," అన్నది.

"రానియ్యవే! మనింట్లో వున్న సొత్తంతా ఎత్తుకు పోతే దీనికి నాలుగింతలు తెస్తాను!" అన్నాడు రామలింగడు.



"నేను రోజూ అడుగుదామని మరిచి పోతున్నాను. ఈ బంగారమూ, రత్నాలూ ఎక్కడ నుంచి తెస్తారండీ మీరూ?" అన్నది రామలింగడి భార్య.

"ఒసే గట్టిగా అరవకు! నేనూ ఈ సొత్తంతా దొంగతనం చేసి తెచ్చిందే!" అన్నాడు రామలింగడు.

"ఎక్కడ దొంగతనం చేస్తారండీ?" అని భార్య అడిగింది.

"ఆ ఊసంతా నీ కెందుకు? అనవసర ప్రసంగం చెయ్యక పడుకుని నిద్రపో!" అన్నాడు రామలింగడు.

"అలా కాదు! చెబితే గాని వదిలి పెట్టను! దొంగతనం చేస్తే మిమ్మల్ని ఎవరూ పట్టుకోరా?" అన్నది భార్య ఎంతో ఆశ్చర్యంతో.

"బ్రహ్మరుద్రుడు దిగివచ్చినా పట్టుకో లేడు. నా దగ్గిర ఒక మంత్రం వున్నది!" అన్నాడు రామలింగడు.

"ఏమిటండీ, ఆ మంత్రం?" అని అడిగింది భార్య.

రామలింగడు చాలాసేపు భార్యమీద విసుక్కుని చివరకు, "నన్ను శనిలాగా పట్టావే! నా రహస్యం చెబుతా విను. రాజుగారి కోటలో ఖజానావుంది చూశావా? అది అయిదు నిలువుల ఎత్తుంటుంది. దాని కప్పుకు కొంచెం దిగువగా గోడలో మనిషి పట్టేటంత గవాక్షం ఒకటున్నది. నేనేం చేస్తానో తెలుసా? వెన్నెల రాత్రి పూట ఖజానా ఇంటి కప్పుమీదికి చేరు కుంటాను. గవాక్షంలో నుంచి వెన్నెల లోపలికి పడేదాకా వేచివుండి, 'ఓం భ్రాంతి! ఓం భ్రాంతి! ఓం భ్రాంతి!' అని మూడుసార్లు చదువుతాను. ఆ మంత్రం చదవగానే చంద్రకిరణాలు తాళ్ళులాగా అయిపోయి నా చేతికి పట్టుచిక్కుతాయి. వాటి చెంబడి జారి ఖజానాలోకి దిగు తాను. నాకు కావలిసిన సొత్తంతా మూట గట్టుకుని మళ్ళీ కిరణాలు పట్టుకుని గవాక్షంలో నుంచి పైకెక్కి వచ్చేస్తాను. దొంగతనం ఎలా జరిగినదీ బ్రహ్మ

రుద్రుడు కూడా తెలుసుకోలేడు. ఇలా వెన్నెల నిచ్చెన సహాయంతో నేను రాజుగారి ఖజానాను కొల్లగొట్ట గలుగుతున్నాను. అందుకే నన్నింతవరకు పట్టుకున్నవారు లేరు!'' అన్నాడు తన భార్యతో.

''అదా సంగతి?'' అంటూ తెనాలి రామలింగడి భార్య తృప్తి చెందిన దానిలాగా నటిస్తూ కళ్ళు మూసుకున్నది.

భార్యాభర్తలమధ్య జరిగిన సంభాషణ యావత్తూ గజదొంగ కూడా విన్నాడు. వాడికి ఇప్పుడు మామూలు దొంగతనాల మీద మోజు తగ్గిపోయింది. ఇక మీదట దోస్తే రాజుగారి ఖజానాయే దోచాలనుకున్నాడు.

మర్నాడు రాత్రే వాడు ఇళ్ళ కప్పు మీదుగా పాకుతూ రాజుగారి ఖజానా ఉండే కప్పును చేరుకున్నాడు. రామలింగడు చెప్పిన గవాక్షం కనిపించింది. అది భూమికి దాదాపు అయిదు నిలువుల ఎత్తున వున్నది. అయినా గజదొంగ భయపడలేదు. ఆ గవాక్షంలో నుంచి చంద్రకిరణాలు ఖజానాలోకి పడేదాకా వేచి ఉండి, వాడు మూడుసార్లు ''ఓం భ్రాంతి! ఓం భ్రాంతి! ఓం భ్రాంతి!'' అని చదివి, గవాక్షం మీద అడుగు పెట్టి చేతితో కిరణాలను పట్టుకున్నట్టు నటిస్తూ లోపలికి దూకాడు.

వాడి చేతికి గాలి తప్ప ఏమీ చిక్కలేదు. అంత ఎత్తునుంచి పడటంవల్ల వాడి కాళ్ళు రెండూ విరిగిపోయాయి. మర్నాడు రాజభటులు ఖజానా తెరిచినప్పుడు, గజదొంగ కదలలేని స్థితిలో ఉండటంవల్ల వాళ్ళకు సులువుగా దొరికిపోయాడు. దొంగతో బాటు వాడు దోచుకున్న సొత్తంతా దొరికింది.

తరవాత తెనాలిరామలింగడు రాయలవారి సభలో తాను గజదొంగను పట్టుకోవటానికి పన్నిన యుక్తిని గురించి చెప్పాడు. సభికులందరూ విరగబడి నవ్వారు.

గజదొంగను పట్టిచ్చినందుకు రాయలవారు రామలింగడికి మంచి బహుమానం కూడా ఇచ్చారు.



# లాభంలేని పని

గ్రామంలో చిల్లర దుకాణం నడిపే, వరహాలయ్యా, ఏ పని చేసినా వ్యాపార ధోరణిలో చేసేవాడు. లాభంలేని పని జోలికి నేను పోను, అని బాహాటంగా అందరితోనూ అనేవాడు.

అతడి పొరుగున వుండే గంగన్నకు, వరహాలయ్యా లాభంలేని పని ఏదైనా చేస్తే చూడాలని కుతూహలంగా వుండేది. అయితే, ఎంతకాలం గడిచినా అతడి కోరిక తీరలేదు. చివరకు గంగన్న విసిగిపోయి, వరహాలయ్యాతో లాభంలేని పని తనే చేయించాలని నిశ్చయించుకుని, అతణ్ణి సూది యివ్వమని అడిగాడు. వరహాలయ్యా యిచ్చాడు. గంగన్న చిరిగిపోయిన తన చొక్కా కుట్టుకుని వరహాలయ్యాకు సూదిని యిచ్చేశాడు. వరహాలయ్యా ఏమీ అనలేదు.

అతడితో లాభంలేని పని చేయించానని గంగన్న తృప్తిపడ్డాడు. మరొకసారి వరహాలయ్యాను సుత్తి అడిగి తీసుకుని, రెండు రోజుల తరవాత యిచ్చేశాడు. ఈసారి వరహాలయ్యా ఏమీ అనలేదు.

ఉండబట్టలేక గంగన్న, వరహాలయ్యాతో, "నీతో లాభంలేని పనులు రెండు చేయించాను," అన్నాడు ధీమాగా.

"నాకు లాభంలేని పని కలలో కూడా చేయను," అన్నాడు వరహాలయ్యా నవ్వుతూ.

"నీ సూది తీసుకున్నాను, నీకేం ఒరిగింది?" అని అడిగాడు గంగన్న.

"దానికి నువ్వు మిగిల్చిన దారంలో, నా పంచ కుట్టుకున్నాను," అన్నాడు వరహాలయ్యా.

గంగన్న గతుక్కుమని, "మరి సుత్తి మాటో!" అన్నాడు.

"దానికి పిడికర్ర వదులైంది. నాకు బద్ధకంవేసి అలాగే వుంచాను. అంతలో నువ్వడిగావు," అన్నాడు వరహాలయ్యా.

గంగన్నకు అప్పుడు జ్ఞాపకం వచ్చింది: అతను గోడకు మేకులు కొడుతుంటే సుత్తి కర్రనుంచి జారింది. అప్పుడు తను పేడుపెట్టి దానిని సరిచేశాడు. —దాసరి వెంకటరమణ






# నయవంచన

బొగ్దాదు నగరపరిసరాల్లోని, ఒక గ్రామంలో ఎండవేళ కొందరు చెట్టు నీడన కూర్చుని మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ దగ్గిరకు ఒక నడివయసు వాడు వచ్చాడు. వాడాగ్రామస్థుడు కాదు. బాగా దుమ్ముకొట్టుకుని వున్న అతడి దుస్తులూ, వట్టినే అటూ ఇటూ తలాడిస్తూ వాడు నడుస్తున్న తీరూ చూస్తే—ఎవరో పిచ్చి వాడిలా వున్నాడు.

వాడు చెట్టుకింద వున్నవాళ్ళను సమీపించి, అందరి ముఖాలకేసీ ఒకసారి పరీక్షగా చూసి, "సుఖాన్ని అంటిపెట్టుకునే దుఃఖం వుంటుంది; విజయం వెన్నంటే అపజయం నడుస్తుంది!" అన్నాడు.

గ్రామస్థులు వాణ్ణి, "నువ్వు చెప్ప దలచుకున్న దేమిటి?" అని అడిగారు.

"నా జీవితానుభవం ద్వారా గ్రహించిన సత్యాన్ని, మీకు చెప్పాను. ఆ అనుభవం ఏమిటో వినండి!" అంటూ వాడు యిలా చెప్పసాగాడు:

వాడు నగరద్వారాల్లో ఒక దానికి కాపలాభటుడు. ఒకనాటి వెన్నెలరాత్రి వాడు ద్వారానికి చేరగిలబడి కునికిపాట్లు పడుతుండగా, ఒక మృదువైన హస్తం వాడి భుజాన్నితాకింది. వాడు చప్పున కళ్ళు తెరిచాడు. ఎదురుగా ఒక అందమైన స్త్రీ చిరునవ్వు నవ్వుతూ, వాడికి కనిపించింది.

కాపలాభటు డామెను, "ఎవరునువ్వు? ఇంత రాత్రివేళ యిక్కడ నీ కేం పని?" అని అడిగాడు.

ఆ స్త్రీ వెంటనే జవాబు చెప్పకుండా, భటుడిచేతిలో కొన్ని వెండినాణాలు పెడుతూ, మరొకసారి చిరునవ్వు నవ్వింది.

"నేను లంచగొండిని కాదు!" అన్నాడు కాపలాభటుడు.

"ఇది లంచంకాదు. లంచమంటే, ఒక చెడ్డపనిలో సాయపడేందుకు యిచ్చే డబ్బు. ఇప్పుడు నేను యిచ్చిన డబ్బు, ఒక మంచిపనిలో నువ్వు, నాకు సాయ పడేందుకు," అన్నదా స్త్రీ.

"ఏమిటంత మంచి పని?" అని అడిగాడు కాపలాభటుడు.

"విడిపోయిన యిద్దరు మిత్రురాళ్లను తిరిగి కలపడం మంచిపని అనిపించు కోదా? నగరఖాజీ కుమార్తె, నేనూ మిత్రురాళ్ళం. అయితే, ఖాజీ ఎందు వల్లనో, మేం యిద్దరం ఒకరినొకరు చూసు కోవడానికి యిష్టపడడం లేదు. ఖాజీ కూతురు బెంగపడివున్నది. ఈ రాత్రి, ఖాజీ ఇంట గడిపేందుకు నువ్వు సాయ పడాలి," అన్నదా స్త్రీ.



"ఇదెలా సాధ్యం?" అన్నాడు భటుడు.

"నువ్వు పూనుకుంటే, యిదేం కష్టం కాదు," అంటూ కాపలాభటుడికి ఏం చేయాలో, ఆ స్త్రీ చెప్పింది.

కాపలాభటుడు, ఆస్త్రీని వెంటబెట్టు కుని, ఖాజీయింటికి వెళ్ళి తలుపుతట్టాడు. ఖాజీతలుపు తెరవగానే వాడు, "అయ్యా, ఈవిడది మరొకపట్టణం. ఇక్కడ ఒక బంధువు ఇంటికని బయలుదేరి, అతడి నివాసం చిరునామా పోగొట్టుకున్నది. మీ ఇంటి వీధివాకిలి పక్కనున్న అరుగు దగ్గిర దుఃఖిస్తూండగా చూశాను. ఈమె తండ్రిని, నే నెరుగుదును. చాలా మర్యా దస్థుల కుటుంబం. ఈమె ఒంటిమీద బంగారు నగలున్నవి. రాత్రివేళ వీధిలో వుండడం క్షేమంకాదు. ఈ రాత్రికీమెకు మీయింట్లో పడుకునేందుకు చోటివ్వడం ధర్మంగా వుంటుంది," అన్నాడు.

ఖాజీ న్యాయకర్తగనక, కాపలాభటుడు చెప్పిన దానికి కాదనలేక, ఆస్త్రీని ఇంట్లోకి రానిచ్చాడు.

ఆ రాత్రి తన పనిముగియగానే కాపలా భటుడు ఇంటికి వెళ్ళాడు. అయితే, మరుక్షణం మరి కొందరు భటులు వచ్చి, ఇంటి తలుపులు గట్టిగా బాదారు.



దాచుకున్న డబ్బు కూడా దొంగిలించి పారిపోయింది.

''ఒరే, తోడుదొంగా, నీకు చావు తప్పదు!'' అంటూ ఖాజీ పెద్దగా అరిచాడు.

కాపలావాడు వణికిపోతూ, ''అయ్యా, చట్టంప్రకారం అపరాధికి, తాను నిరపరాధినని రుజువు చేసుకునేందుగ్గానీ, లేక జరిగిన నష్టానికి పరిహారం యిచ్చేందుగ్గానీ, మూడు రోజుల గడువు వుంటుంది గదా! ఆ మూడు రోజులగడువూ నాకు దయచేయించండి,'' అని కోరాడు.

ఇందుకు కొత్వాలుతోపాటు ఖాజీ కూడా ఒప్పుకున్నాడు. కాపలావాడు రెండు రోజులపాటు, ఆ స్త్రీకోసం నగరవీధులన్నీ తిరిగాడు. ఎక్కడా ఆమె కనిపించలేదు. వాడికి యిక చావు తప్పదన్న భయం పట్టుకున్నది.

అయితే, మూడవనాడు ఒకానొక ఇంటి కిటికీలోంచి వాడికి, ఆ స్త్రీ ముఖం కనబడింది. ఆమె వాణ్ణి చూస్తూనే చిరునవ్వు నవ్వి, రమ్మన్నట్టు చేయివూపింది. కాపలావాడు పరిగెత్తుతూపోయి, ''ఆఁ, దొరికావా, దొంగా!'' అంటూ పళ్ళు కొరికాడు.

ఆమె ఏ మాత్రం భయపడక, ''నేను దొరకడంకాదు. ఎలా అయితే నేం, నేను

కాపలాభటుడు కోపంగా తలుపు తీసి సంగతడిగితే, ఆ వచ్చిన వాళ్ళు, వాణ్ణి తక్షణం కొత్వాలు దగ్గిరకు రమ్మని తొందర పెట్టారు. వాడు వాళ్ళతోకలిసి కొత్వాలు దగ్గిరకు పోయాడు.

అక్కడ కొత్వాలుతోపాటు ఖాజీకూడా వున్నాడు. ఖాజీ వాణ్ణిచూస్తూనే కళ్ళెర్ర చేసి, ''ఒరే, దుష్టుడా! నీ దొంగ స్నేహితురాలెక్కడ?'' అని అడిగాడు గద్దిస్తూ.

కాపలావాడు ఆ ప్రశ్న వింటూనే మొదట ఆశ్చర్యపోయాడు. తరవాత వాడికి తెలిసిందేమంటే—రాత్రి వాడు ఖాజీ యింట ఆశ్రయం యిప్పించిన స్త్రీ, ఖాజీ ఇంటగల బంగారంతోపాటు, అతడు

నిన్ను పట్టుకున్నాను!'' అన్నది పెద్దగా నవ్వుతూ.

''నీ కారణంగా, నేనెన్ని కష్టాల పాల యాను!'' అన్నాడు కాపలావాడు.

''నీ వల్ల, నా కేమన్నా తక్కువ కష్టా లొచ్చినవనుకున్నావా?'' అంటూ ఆమె ప్రశ్నించింది.

''నా వల్ల, నీకు కష్టాలా! ఏమిటవి?'' అని అడిగాడు కాపలావాడు.

ఆమె ఒకటి, రెండు క్షణాలు చిరు నవ్వు నవ్వుతూ వూరుకుని, తరవాత, ''నువ్వెంత అమాయకుడివి! నేను కిటికీలోంచి వీధికేసి ఎందుకు చూస్తున్నా ననుకుంటున్నావు? ఏదో ఒకనాడు నువ్వీ వీధివెంటవస్తావని, నాకు తెలుసు!'' అన్నది.

''అర్థంలేని పేలాపన మాను. నాసా యంతో ఖాజీ యింటచేరి, ఆయన ఇల్లంతా దోచావు. నీకు, నాతో ఇంకేం పని?'' అని అడిగాడు కాపలావాడు.

''ఖాజీ అన్యాయంగా ఆర్జించిన ధనాన్నంతా దొంగిలించిన మాట నిజమే. ఆ పని ఎందుకు చేశాననుకుంటున్నావు? మనం యిద్దరం పెళ్ళి చేసుకుని, ఆ ధనంతో హాయిగా బతకవచ్చు నన్న ఆశతో. ఇదుగో, చూడు!'' అంటూ ఆమె అక్కడవున్న ఒక బీరువా తెరిచింది.



దానిలో బంగారు నగలతోపాటు చాలా ధనంకూడా వున్నది.

కాపలావాడు కళ్ళింతచేసుకుని ఆ ధనం కేసి చూస్తూ, ''అంతా బాగానే వుంది. కాని, ప్రస్తుతం నేను చిక్కుల్లో వున్నాను, ఖాజీ ఇంట జరిగిన దొంగ తనంలో నీతోపాటు నాకూ పాలున్నదని, నా మీద నేరం మోపారు,'' అన్నాడు.

''అంతే గదా! భయపడకు. ఖాజీయే నేరస్థుడని రుజువుచేసే పథకం ఒక టున్నది!'' అంటూ ఆమె కాపలాభటు డికి ఏమిచేయాలో చెప్పింది.

అది విన్న కాపలావాడూ, ఆమే కూడా కాసేపు నవ్వుకున్నారు. కాపలావాడు



అక్కణ్ణించి బయలుదేరి కొత్వాలు దగ్గిరకు పోయి, "అయ్యా, ఆ స్త్రీ యింకా ఖాజీ ఇంట్లోనే వున్నదని, నా నమ్మకం. కొన్ని ఆరాలు తీశాక, యీ నమ్మకం కలిగింది. ఖాజీ ఇంట ఆమె ఎక్కడున్నదో నేను వెతికి చూస్తాను," అన్నాడు.

కొత్వాలూ, కాపలావాడూ కలిసి ఖాజీ ఇంటికి వెళ్ళారు. సంగతి విన్న ఖాజీకి ఆశ్చర్యంతోపాటు, కోపం కూడా వచ్చింది. అయినా, ఇల్లంతా వెతికి చూసేందుకు ఒప్పుకున్నాడు.

కాపలావాడు ఇంటి గదులన్నీ వెతుకుతూ, ఒక గదిలోని కొయ్య పెట్టెల వెనక్కు తొంగి చూస్తూ, ఖాజీని, "అయ్యా, ఆ స్త్రీ ధరించిన దుస్తులరంగు చెప్పగలరా?" అని అడిగాడు.

"పసుపుపచ్చ దుస్తులు....అలా అనే నాకు గుర్తు," అన్నాడు ఖాజీ.

ఆ వెంటనే కాపలావాడు ఒక పెట్టె వెనక నుంచి స్త్రీలు ధరించే దుస్తు నొకదానిని బయిటికి లాగాడు. దాని రంగు పసుపుపచ్చ; అక్కడక్కడా నెత్తురు మరకలున్నవి.

అది చూస్తూనే ఖాజీ, కొత్వాలూ నివ్వెరపోయారు. రెండు, మూడు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోయినై.

కొత్వాలు గట్టిగా గొంతు సవిరించుకుని ఖాజీని, "ఆ స్త్రీని మీరెందుకు చంపారు?" అని అడిగాడు.

"చంపడమా? ఆవిణ్ణి నేను చంపాననా, మీరనేది?" అంటూ ఖాజీ కుప్పలా కూలిపోయాడు.

కొత్వాలుకు అతడి మీద జాలికలిగింది. ఆయన ఖాజీని ఓదార్చుతూ, "భయపడకండి! ఈ హత్య మీ ఇంట్లో వాళ్ళు మరెవరైనా చేసి వుంటారు. సరే, మీపట్ల కొంత ఉదారంగా వుండదలిచాను. మీకెలాంటి చిక్కులూ రావు. ఈ జరిగినదంతా మరిచిపోదాం," అని, కాపలాభటుడితో, "ఎవళ్ళతోనూ, యీ సంగతి చెప్పకు," అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

''అయ్యా, తమ ఆజ్ఞ శిరసావహిస్తాను," అన్నాడు కాపలావాడు లోలోపల ఎంతో తృప్తిగా.

తరవాత వాడు కొత్వాలుతోపాటు ఖాజీ యింటిలో నుంచి బయిటికి వచ్చి, మహదానందపడిపోతూ, ఆ స్త్రీ వున్న ఇంటికేసి బయలుదేరాడు. వాడికి, ఆ స్త్రీ తెలివితేటలూ, చాకచక్యం అద్భుతం అనిపించినై. ఆమె ఖాజీ ఇల్లంతా నిలువు దోపిడీ చెయ్యడమేకాక, అక్కడ తాను హత్యచేయబడినట్టు రుజువులు కూడా వదిలింది!

కాపలావాడు, ఆస్త్రీవున్న ఇంటికిపోయి చూడగా తలుపుకు తాళం బిగించివున్నది. వాడు ఆమెకోసం చాలాసేపు ఎదురుచూసి చూసి, విసుగుపుట్టి పక్కఇళ్ళ వాళ్ళను, ఆ ఇంటియజమానురాలు ఎక్కడికి వెళ్ళిందని అడిగాడు.

''ఆమె ఇంటి యజమానురాలా, నయం! ఆ ఇల్లు కొంతకాలంగా పాడుపెట్టివున్నది. అయితే, ఒకావిడ గత మూడు, నాలుగు రోజులుగా, ఆ ఇంట చేరినమాట నిజం. ఆవిడ, యివ్వాళ ఇల్లు వదిలిపోవడం చూశాం," అన్నారు పొరుగు ఇళ్ళవాళ్ళు.

ఇది జరిగినప్పటి నుంచీ కాపలావాడు, మతిచెడినవాడిలా అక్కడా, యిక్కడా తిరుగుతున్నాడు.

వాడు తన కథ చెప్పి, చెట్టునీడన కూర్చున్న గ్రామస్థులను, ''ఆ నయవంచకురాలికి ఖాజీ ఇల్లు దోచేందుకు సాయపడ్డాను. గౌరవంగా బతికే ఖాజీ పరువుప్రతిష్ఠలు నావల్ల పూర్తిగా దెబ్బతినిపోయినై. దీనికంతకూ కారణం నా దురాశా, బుద్ధిహీనతా! ఇలాంటి నేను మామూలు మనిషిమాదిరిగా ప్రవర్తించడం ఎలా సాధ్యం? మీరే చెప్పండి?" అని అడిగాడు.

గ్రామస్థులకు వాడిమీద ఎక్కడలేని జాలీకలిగింది. వాళ్ళు వాణ్ణి తమతోపాటు చెట్టు నీడలో కూర్చోవలసిందిగా ఆహ్వానించారు.



# అసలు రహస్యం

సముద్రగుప్తుడూ, ధనగుప్తుడూ సిరిపురపు వర్తకులు. వాళ్ళు వ్యాపార పనుల మీద ఓడల్లో పరదేశాలకు పోయి వస్తూండేవాళ్ళు. ఒకసారి వాళ్ళు ఓడలో సిరిపురానికి తిరిగి వస్తూండగా, ధనగుప్తుడు, సముద్రగుప్తుడికి రెండు వజ్రాలను చూపించి, "మొదటిసారిగా చాలా ధనంపోసి, యీ వజ్రాలను కొన్నాను. ఇప్పుడేమో సముద్రపు దొంగల భయం పట్టుకున్నది." అన్నాడు.

సముద్రగుప్తుడు అతడికి నడుం చుట్టూ వున్న దుస్తుల మడతల్లో వాటిని దాచుకోమని సలహా యిచ్చాడు. ఆ మర్నాడే సముద్రపు దొంగలు వాళ్ళున్న ఓడను అటకాయించి, ఓడలోకి ఎక్కి వాళ్ళున్న చోటుకు వచ్చారు. దొంగల నాయకుడు వాళ్ళతో, "అనవసరంగా దుర్మరణంపాలు కాకండి! మీ దగ్గిరున్న విలువైన వస్తువులన్నీ అప్పగించండి," అన్నాడు కత్తి చూపుతూ.

సముద్రగుప్తుడూ, ధనగుప్తుడూ తాము పరదేశాల్లో కొన్న వస్తువులుగల సంచులనూ, పెట్టెలనూ దొంగల నాయకుడికి యిచ్చేశారు.

"అన్నీ యిచ్చేశారా లేక ఏమైనా దాచుకున్నారా?" అంటూ దొంగల నాయకుడు వాళ్లను సమీపించబోయాడు. వెంటనే సముద్రగుప్తుడు, ధనగుప్తుడితో, "ప్రాణం కంటే ఎక్కువా ఏమిటి? ఆ రెండు వజ్రాలను కూడా యిచ్చెయ్యి," అన్నాడు.

ధనగుప్తుడు దాచిన రెండు వజ్రాలను కూడా దొంగల నాయకుడికి యిచ్చేశాడు. దొంగలు వెళ్ళిపోగానే అతడు, సముద్రగుప్తుడితో కోపంగా, "ఇంత నమ్మకద్రోహం చేస్తావనుకోలేదు!" అన్నాడు.

సముద్రగుప్తుడు తన నడుం చుట్టూ బిగించుకున్న తోలుపటకాను విప్పి అతడికి చూపిస్తూ, "ఇందులో నువ్వు కొన్న వాటికన్న విలువైన ఇరవై వజ్రాలున్నవి. నాలుగు వజ్రాలు తీసుకో. దొంగల నాయకుడితో నేనలా ఎందుకన్నానో, ఆ అసలు రహస్యం నువ్వు గ్రహించలేదు. నేనలా అనకపోతే, నీ దుస్తులతోపాటు, నావీ వెతికి చూసి మొత్తం వజ్రాలు ఎత్తుకుపోయేవాడు," అన్నాడు.

—సి. యస్. ఎ. షరీఫ్






సృష్టికి పూర్వం ప్రపంచం జలమయమై, పదార్థ శూన్యమై, అంధకారంలో ఉండగా జలం నుంచి ఒక మహాతేజస్సు పుట్టింది. కాలక్రమాన అది జ్యోతిర్లింగ స్వరూపం దాల్చింది, అదే పరమేశ్వరుడైన శివుడు. ఆ జ్యోతిర్లింగం యొక్క అర్ధభాగం నుంచి మహాశక్తి పుట్టింది. ఆ మహాశక్తినే ప్రకృతి అనీ, మహామాయ అనీ పిలుస్తారు.

కాలక్రమాన పరమేశ్వరీ పరమేశ్వరులు మహావిష్ణువును సృష్టించారు. మహావిష్ణువు నాబి నుండి మహా పద్మం పుట్టింది. అది అనేకవేల యోజనాల నిడివి గలిగి మహా ఆశ్చర్యకరంగా ఉన్నది. ఆ మహా పద్మంలో అయిదు ముఖాలతో బ్రహ్మ పుట్టాడు. ఆ బ్రహ్మతో బాటే సరస్వతీ పుట్టింది.

ప్రపంచమంతా జలమయంగా ఉండటం గమనించి బ్రహ్మ తనకు జన్మ స్థానమైన మహా పద్మం అంతు తెలుసుకోవాలని ఊర్ధ్వ అధో లోకాల మధ్య అనేక ప్రయాణాలు చేసి తిరిగి పద్మ గర్భం చేరుకున్నాడు. బ్రహ్మ ఓంకారాన్ని జపించగా, విష్ణువు బ్రహ్మ ఎదట ప్రత్యక్షమయాడు. బ్రహ్మ విష్ణువును చూసి, "ఎవరు నువు? ఇక్కడి కెందుకు వచ్చావు?" అని అడిగాడు.

''సృష్టి చేయటానికి నిన్ను నా నాభి కమలం నుంచి పుట్టించాను. నేను విష్ణువును.'' అన్నాడు విష్ణువు.

1. దక్షయజ్ఞం



పరమేశ్వరుడు వారి ఎదట ప్రత్యక్షమై, ''నువు పంచభూతాత్మకమైన ప్రపంచాన్ని సృష్టించటానికిగాను ఈ విష్ణువు యొక్క నాభికమలం నుంచి సృష్టించబడినవాడివి. అందుచేత సృష్టి ఆరంభించు'' అని బ్రహ్మతో అన్నాడు.

బ్రహ్మ పరమేశ్వరుణ్ణి చూసి, ''నువు ఎవడివి? నాతో సమంగా నీకు అయిదు ముఖా లెందుకున్నాయి? నేను సృష్టికర్తను గనుక నాకు అయిదు ముఖాలుండటం సమంజసం!'' అన్నాడు.

ఆ మాటలు విని పరమేశ్వరుడు రుద్రావతారం దాల్చి, తన ఎడమ చేతి చిటికెనవేలి గోరును కత్తిగా ఉపయోగించి, బ్రహ్మకున్న అయిదు తలలలో ఒకటి ఖండించేశాడు. దానితో బ్రహ్మ గర్వం మాని, రక్షించమని పరమేశ్వరుణ్ణి ప్రార్థించాడు.

పరమేశ్వరుడు రౌద్రం వదిలి శాంతం వహించి, ''ఓ బ్రహ్మ, సృష్టించటానికి నువూ, నీ సృష్టిని రక్షించటానికి ఈ విష్ణువూ సృష్టించబడ్డారు. నేను లయకారకుడైన శివుడుగానూ, రుద్రుడుగానూ, ఈశ్వరుడుగానూ పిలవబడతాను. జ్వాలా లింగాన్నే పార్థివలింగమనీ, శివలింగమనీ పూజించండి,'' అని చెప్పి, ఆ జ్వాలా లింగంలో ఐక్యమయాడు.

బ్రహ్మ అహంకరించి, ''నీ ప్రగల్భాలు కట్టి పెట్టు. లేదా నాతో యుద్ధానికి రా. నేను స్వయంభువును, జగత్కర్తను,'' అన్నాడు.

అప్పుడు విష్ణువు ధ్యానించగా పరమేశ్వరుడు జ్వాలాలింగ రూపంలో బ్రహ్మ విష్ణువుల మధ్య ప్రత్యక్షమయాడు. అప్పుడు విష్ణువు బ్రహ్మతో, ''దీని ఆద్యంతాలు మనిద్దరిలో ఎవరు కనుక్కుంటే వారు గొప్ప,'' అన్నాడు. బ్రహ్మ అందుకు సమ్మతించాడు. కాని ఆ ప్రయత్నంలో ఇద్దరూ ఓడిపోయి యథాస్థానానికి తిరిగి వచ్చి, పరమేశ్వరుణ్ణి ప్రార్థించారు.

తరవాత బ్రహ్మ విష్ణువు నుంచి వేదం మొదలయినవి తీసుకుని, పద్మాసనం మీద కూర్చుని ఓంకారాన్ని జపిస్తూ ఉండగా, నీటి మీద తేలుతూ ఒక గుడ్డు బ్రహ్మకేసి వచ్చింది. బ్రహ్మ దాని కేసి ఆశ్చర్యంగా చూశాడు. అంతలో ఆ గుడ్డు నుంచి 'ఓం' అనే శబ్దం బయటికి వచ్చింది. అది వచ్చిన మార్గాన బ్రహ్మ ఆ అండంలో ప్రవేశించాడు. అందులో గాఢాంధకారంగా ఉన్నది. బ్రహ్మ అక్కడ తన శరీరాన్ని విసర్జించి, చతుర్ముఖుడుగా తిరిగి పుట్టాడు. బ్రహ్మ అండం నుంచి బయటికి వచ్చినప్పుడది రెండుగా చీలి, కింది భాగం భూమిగానూ, పై భాగం ఆకాశంగానూ ఏర్పడింది; నీరు ఇంకి పోయింది.

ఇది చూసి బ్రహ్మ చాలా సంతోషించి భూమి మీద సమస్త చరాచరాలను సృష్టి చేయ నారంభించాడు. బ్రహ్మ సృష్టి చేసిన మొదటి వాళ్లు సనకసనంద నాదులు. వాళ్ళు సృష్టి చేసే ఆసక్తి లేక, పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తూ తపస్సు చేసుకునేటందుకు వెళ్ళి పోయారు. అది చూసి బ్రహ్మ గట్టిగా ఏడ్చాడు.

ఆయన కన్నీరు భూమి మీద పడగా అందులో నుంచి గొప్ప తేజస్సుతో శివుడు పుట్టాడు.



అతను తెల్లగా ఉండి, దశదిశలనూ వెలిగిస్తూ ఉండటం చూసి బ్రహ్మ ఆశ్చర్యపోతూ, "ఎవరు నువు?" అని అడిగాడు.

"నేను శివుణ్ణి, రుద్రుణ్ణి," అన్నాడు శివుడు.

అప్పుడు అక్కడ విష్ణువు ప్రత్యక్షమై, "బ్రహ్మ! నువు సృష్టించి నేను పోషించే చరాచరాలను లయం చెయ్యటానికి పరమేశ్వరుడే ఈ శివుడి రూపంలో పుట్టాడు," అన్నాడు.

బ్రహ్మకు సత్యలోకమూ, విష్ణువుకు వైకుంఠమూ, శివుడికి కైలాసమూ వాసస్థానాలుగా ఏర్పాటయాయి. అందుచేత



బ్రహ్మ సత్యలోకానికి వెళ్ళి, తనకు సహాయంగా ఉండటానికిగాను, మరీచి, కశ్యప, దక్ష, గౌతమ, వసిష్ఠ, కర్దమ మొదలైన తొమ్మిది మంది ఉపబ్రహ్మలను సృష్టించాడు.

వీరిలో దక్షుడికి అరవైనలుగురు కుమార్తెలు కలిగారు. ఆ కుమార్తెలలో అదితి మొదలైన పదిమందిని కశ్యపుడు పెళ్ళాడి పిల్లలను కన్నాడు. అదితికి ఇంద్రుడు మొదలైన దేవతలు పుట్టారు; దితికి దైత్యులు పుట్టారు; వినతకు గరుత్మంతుడూ, అనూరుడూ పుట్టారు; కద్రువకు సర్పాలు పుట్టారు; స్వసకు యక్ష, రాక్షసులు పుట్టారు.

శివుణ్ణి పెళ్ళాడటం కోసం మహేశ్వరి దక్షుడికి సతి అనే కుమార్తెగా పుట్టింది. వారిద్దరికి వివాహం జరిగినప్పుడు బ్రహ్మ, విష్ణువూ, ఇంద్రుడు మొదలైన దేవతలూ వచ్చి, సతీ శివులను అనేకవిధాల స్తోత్రం చేశారు. వచ్చినవారి కందరికీ గౌరవ మర్యాదులు చెయ్యటానికి నందీశ్వరుణ్ణీ, కాలభైరవుణ్ణీ నియమించి, శివుడు సతీ సమేతుడై కైలాసానికి వెళ్ళి సుఖంగా ఉన్నాడు.

కొంతకాలం గడిచింది. అనేకమంది మహామహులు ప్రయాగ అనే నగరంలో గొప్ప యాగం తలపెట్టి, బ్రహ్మ విష్ణు మహేశ్వరులనూ, ఇంద్రాది దేవతలనూ పిలిచి, యాగం ప్రారంభించారు.

యజ్ఞానికి వచ్చినవారికి వసతులు ఏర్పాటు చేసి, మహర్షులు వారి వారికి తగిన ఆసనాలు చూపి కూర్చోబెట్టారు. అందరూ కూర్చుని యజ్ఞాన్ని చూస్తూండగా దక్షుడు తన శిష్యులతో సహా వచ్చాడు. అప్పుడు సభలోని వారందరూ లేచి దక్షుడికి ఎదురు వెళ్ళి పలకరించి తీసుకు వచ్చి కూర్చోబెట్టారు. దక్షుడు సభ నంతా కలయజూసి, బ్రహ్మ విష్ణులకు నమస్కారం చేసి, తన అల్లుడైన శివుడు లేవలేదనీ, తనను పలకరించ లేదనీ గమనించి సభవారితో, "మీ రందరూ

లేచి వచ్చి నన్ను గౌరవించారు. ఈ ఈశ్వరుడు నాకు అల్లుడైన కారణం చేత, లేవక, నన్ను పలకరించక నిర్లక్ష్యం చేశాడు. ఇతనికి చిన్నా పెద్దా తారతమ్యం తెలీదు,'' అని తన శిష్యులతో సహా వెళ్ళిపోసాగాడు.

అది చూసి బ్రహ్మ, విష్ణువూ మొదలైన వాళ్ళు దక్షుడికి అడ్డం వెళ్ళి, ''అతను ఈశ్వరుడు. పరమేశ్వరావతారుడు. అతనిని, ఈ విధంగా నిందించటం తప్పు,'' అని చెప్పారు.

అప్పుడు నంది కోపంపట్టలేక దక్షుడితో, ''ఓ దక్షా, శివదూషణ చేసిన నీ శిరస్సు తెగి హోమగుండంలో పడుగాక!'' అని శపించాడు.

అది విని దక్షుడు అలిగి, ''మీ రుద్ర గణాల వాళ్ళు వేదబాహ్యులై, అచార హీనులై, బూడిద పూసుకుని, పాషండులని పేరు తెచ్చుకుందురు గాక!'' అని తిరిగి శపించాడు.

శివుడు యజ్ఞం పూర్తి అయేదాకా ఉండి, తన రుద్రగణాలను వెంట బెట్టుకుని కైలాసానికి వెళ్ళిపోయాడు.

. దక్షుడు తన శిష్యులైన భృగువు మొదలైన రుషులను వెంటబెట్టుకుని తన ఆశ్రమానికి వచ్చి వాజిపేయమనే యజ్ఞం చేశాడు. ఆయనకు శివుడి మీద చాలా



కోపంగా వున్నది. అందుచేత ఈ వాజిపేయంలో శివుడికి హవిర్భాగం లేకుండా చేశాడు.

అప్పటికీ దక్షుడికి శివుడి పైన కోపం చల్లారలేదు. అందుచేత ఆయన ''బృహస్పతి యజ్ఞం'' అనే మహాయజ్ఞం తలపెట్టి దానికి దేవతలనూ, మహర్షులనూ ఆహ్వానించి, వచ్చినవారిని సత్కరించటానికి తన శిష్యులనూ బంధువులనూ నియోగించాడు.

ఇందులో కూడా ఆయన శివుడికి భాగం ఇవ్వదలచలేదు.

ఈ యజ్ఞానికి విశ్వదేవతలూ, మరుత్తులూ, పితృగణాలూ, అప్సరసలూ,



గంధర్వ, సిద్ధ, విద్యాధర, కిన్నర, యక్షులూ; కశ్యప, అగస్త్య, అత్రి, భృగు, మరీచి, నారద, పరాశరాది మహర్షులూ వచ్చారు. బ్రహ్మ విష్ణులు తప్ప మిగిలిన వారంతా దక్షుడికి భయపడే వచ్చారు. వచ్చినవారి కందరికీ విడుదులు ఏర్పాటు చెయ్యటానికి విశ్వకర్మ నియోగించ బడ్డాడు.

దక్షుడు యజ్ఞదీక్ష వహించి, భార్యా సమేతుడై యాగశాల ప్రవేశించి, సభా వందనం చేశాడు. పిలవని కారణంగా శివుడు ఆ సభలో లేడు. బ్రహ్మ విష్ణువులు పిలిచినా రాలేదు. అనేకమంది దేవతల తోనూ, మహర్షులతోనూ నిండి ఉన్న ఆ సభలో శివభక్తులైన మరీచీ, దధీచీ, భృగుడూ మొదలైన మహర్షులు సభను కలయజూసి, "ఓ దక్షా, ఈ సభకు సతీ దేవినీ, శివుణ్ణీ పిలవలేదా? వాళ్లు ఇక్కడ ఎందుకు లేరు?" అని అడిగారు.

దానికి దక్షుడు, "శివుడు కర్మభ్రష్టుడు. అందుచేత అతన్ని పిలవలేదు. అతను అపవిత్రుడు, కపాలధారి, శ్మశానవాసి, ప్రేతగణాలకు ప్రభువు," అన్నాడు.

ఈ శివ దూషణ విని దధీచి, "దక్షా, ఈ యాగం నెరవేరదు. శివుడు లేకుండా ఈ యాగం తలపెట్టి నువ్వు ఆపదనూ, విచారాన్నీ కొని తెచ్చుకుంటున్నావు. ఈ యాగానికి వచ్చినవారు కూడా దుఃఖిస్తారు," అని వామదేవుడూ, మరీచీ, గౌతముడూ, శిలాదుడూ మొదలైన అనేక మంది ఋషులతో సహా సభ నుండి వెళ్ళి పోయాడు.

దక్షుడు అలా వెళ్ళిపోయినవారిని గురించి సభలో నిలిచి ఉన్నవారితో, "వాళ్ళు పాషండులు, శఠులు. వాళ్ళు వెళ్ళిపోవడమే మంచిది. అందుచేత మీ రేమీ విచారించక, నా యజ్ఞాన్ని పూర్తి చెయ్యండి," అన్నాడు.

ఈ లోపల కైలాస పర్వతం మీద శివుడితో సుఖంగా కాపరం చేస్తున్న సతి ఒకనాడు తన చెలికత్తెలతో ఉద్యానంలో

విహరిస్తూ, ఆకాశాన అనేక విమానాలు పోతూండటం చూసింది. ఆ విమానాలు ఎక్కడికి పోతున్నాయో కనుక్కోమని సతీదేవి తన చెలికత్తెలను అడిగితే వాళ్ళు వెళ్ళి వచ్చి, దక్షుడు చేస్తున్న యజ్ఞానికి వాళ్ళంతా వెళుతున్నట్టు చెప్పారు.

సతీదేవికి తాను కూడా తన భర్తతో సహా తన తండ్రి చేసే యజ్ఞానికి పోవాలని కోరిక కలిగింది. ఆమె శివుడి వద్దకు వెళ్ళి, "మా నాన్న యజ్ఞం చేస్తున్నాడట. దేవగణాల వాళ్ళంతా వెళుతున్నారు. మనం కూడా రుద్రగణాలను తీసుకుని అక్కడికి వెళదాం," అన్నది.

దానికి శివుడు, "సతీ, మన మీద నీ తండ్రికి ద్వేషం. అందుచేత మనల్ని పిలవకుండానే యజ్ఞం చేస్తున్నాడు. పిలవని పేరంటానికి పోరాదు. పోతే మనకు అవమానం జరుగుతుంది. తరవాత ఆపదలు కలుగుతాయి," అన్నాడు.

"అలా అయితే, మీరు రావద్దు. నేను ఒక్కత్తెనే పోతాను. నా వాళ్ళు నన్నెందుకు అవమానిస్తారు ? నా తండ్రికి తోచకపోతే నేనైనా చెప్పి, మిమ్మల్ని పిలిచేటట్టు చేస్తాను. నందీశ్వరుడు మొదలైనవాళ్ళను సహాయం ఇచ్చి నన్ను పంపండి," అన్నది సతీదేవి.

"సతీ, నిన్ను విడిచి నేను క్షణం ఉండలేను. నువు నన్ను విడిచి మీ తండ్రి చేసే యజ్ఞానికి వెళ్ళిపోతున్నావు. నీకు తప్పక అవమానం జరుగుతుంది, ప్రమాదం కలుగుతుంది. రాబోయేది కాస్త ఆలోచించు," అని శివుడు సతీదేవితో అన్నాడు.

కాని సతీదేవి శివుడి మాటలలో ఉన్న నిజం తెలుసుకోలేక పోయింది. తన తల్లిదండ్రులు తనను అవమానిస్తారని ఊహించలేక ఆమె పుట్టింటికి వెళ్ళాలని పట్టుపట్టింది.

ఎలా జరగవలసి ఉంటే అలా జరుగుతుందనుకుని శివుడు రుద్రగణాలను తోడిచ్చి సతీదేవిని దక్షయజ్ఞం చూడటానికి పంపించాడు.





# ఆత్రగాడి మంత్రసిద్ధి

మహాదేవశాస్త్రి అనే పండితుడు నడుపుతున్న గురుకులంలో, వృషభుడనే శిష్యుడు ఏ పని చేయడానికైనా ఆత్రపడి పోయేవాడు. వీలైతే ఒక్కరోజులోనే సర్వ శాస్త్రాలూ నేర్చుకుని, సహాధ్యాయులందర్నీ మించి పోవాలన్నంత ఆత్రం వాడిది.

గురువుగారి ఇంటి అటక మీద కొన్ని పురాతన తాళపత్రగ్రంథాలున్నవి. అవి గొప్ప మంత్ర శాస్త్రగ్రంథాలని గురుకులంలో అందరూ అనుకునేవారు. వాటిని చూడాలని ఎంత కుతూహలం వున్నా, గురువుగారు వాటిజోలికి పోవద్దని ఆంక్ష పెట్టడంతో, శిష్యులెవరూ ఒక్కసారి కూడా వాటిని చూసేందుకు ప్రయత్నించ లేదు. కాని, వృషభుడు మాత్రం ఆ తాళపత్రాలను ఏదో విధంగా చదవాలని ఎప్పుడూ ఆత్ర పడుతూండే వాడు.

ఒకసారి మహాదేవశాస్త్రికి రాజధానిలో ముఖ్యమైన పని పడింది. వారం రోజుల్లో తిరిగి వస్తానని శిష్యులకు చెప్పి వెళ్ళిపోయాడు.

ఆనాటి రాత్రి సహాధ్యాయులంతా గాఢ నిద్రలో వుండగా, వృషభుడు నిశ్శబ్దంగా అటక ఎక్కి, ఒక తాళపత్ర గ్రంథం తెరిచాడు. అక్కడ ఒక మంత్రం వున్నది. ఆ మంత్రం జపిస్తే, మనిషి కోరిన రూపం తెచ్చుకో వచ్చు. వృషభుడు ఆ మంత్రాన్ని ఒకటికి రెండుసార్లు చదివి, కంఠస్థం చేసుకుని ఉత్సాహంగా అటక దిగి వచ్చాడు.

వాడిప్పుడు తోటివాళ్లందరికన్నా ఎంతో గొప్ప వాడైనట్టు భావించుకుని మురిసి పోయాడు.

మర్నాడు శిష్యులందరూ సమిధలు ఏరి తెచ్చేందుకూ, విస్తళ్ళు కుట్టేందుకు

గుంటక సాంబిరెడ్డి



ఆకులకోసం అడవికి వెళ్ళారు. అక్కడ వృషభుడు వుండబట్టలేక, తనకు ఒక అద్భుతమైన మంత్రం తెలుసునని తోటి వాళ్ళతో అన్నాడు. వాళ్ళామాట నమ్మక, వాణ్ణి ఎగతాళిచేయసాగారు.

దానితో వృషభుడు రెచ్చిపోయి, ''కావాలంటే యిప్పటికిప్పుడు మంత్రం జపించి, ఏ రూపమైనా తెచ్చుకోగలను!'' అన్నాడు.

''నీ పేరే వృషభుడుకదా! పేరుకు తగ్గట్టు, ఎద్దురూపం తెచ్చుకో,'' అన్నా డొకడు నవ్వుతూ.

వృషభుడు వెంటనే మంత్రం జపించి ఎద్దు రూపం తెచ్చుకున్నాడు. శిష్యులంతా ఎక్కడలేని ఆశ్చర్యంతో వాడి కేసి చూడ సాగారు.

అయితే, అంతలో కొద్ది దూరాన్నుంచి పులి గాండ్రింపు వినబడింది. మరుక్షణం కొన్ని జంతువులు వాళ్ళపక్క నుంచే పరిగెత్త సాగినై. శిష్యులంతా దాపుల నున్న చెట్లపైకి ఎగబాకిపోయారు. ఎద్దు రూపంలో వున్న వృషభుడికి అప్పుడు తను చేసిన తప్పు తెలిసివచ్చింది. వాడికి మంత్రం జపించి, ఏదో ఒక రూపం తెచ్చుకోవడం మాత్రమే తెలుసుగాని, దాని నుంచి తిరిగి మనిషిగా మారేమంత్రం తెలియదు !

వాడేం చేయడమా అని ఆలోచిస్తు న్నంతలో, పెద్దపులి అటుకేసి వచ్చింది. దాన్ని చూస్తూనే వృషభుడు వెనుదిరిగి, రొప్పుతూ రోజుతూ పరిగెత్తి అడవి దాటి ఒక గ్రామం చేరాడు.

అప్పటికి భోజనాలవేళ అయింది. ఎంతో దూరం పరిగెత్తడం చేత వృషభు డికి ఆకలి వేస్తున్నది. ఎద్దు రూపంలో వున్నందువల్ల, ఎవరూ భోజనం పెట్టరని, వాడికి అర్థమైపోయింది. మరి ఆకలి చల్లార్చుకోవడం ఎలా ?

వాడు అయిష్టంగానే దాపులనున్న ఒక జొన్న చేను దగ్గరకుపోయి, అందులో ప్రవేశించాడు. అయితే, ఆ చేనుకు కాపలా

వున్నవాడు వృషభుణ్ణి చూస్తూనే, ఒక బాణాకర్ర తీసుకుని పరుగునవచ్చి, డొక్క మీదా, వెన్ను మీదా బాదసాగాడు. వృషభుడు బాధకొద్దీ అరుస్తూ, గ్రామం లోకి పరిగెత్తాడు.

వాడి కష్టాలు అంతటితో తీరలేదు. గ్రామవీధుల్లో తిరుగుతూండగా, వాడికి పర్వతంలా వున్న ఒక పొగరుబోతు ఆబోతు ఎదురయింది. దాన్ని చూస్తూనే వాడు వెనుదిరిగాడు. కాని, ఆబోతు భీకరంగా రంకెలువేస్తూ పరుగున వచ్చి వాడి మీద పడి, వాడికొమ్ములతో కుమ్మ సాగింది.

వృషభుడు ఆబోతు బారినుంచి తప్పించుకునేందుకు, సందు గొందుల్లో పరిగెత్తి, కొంతసేపటికి దాని కనుమరుగయ్యాడు.

ఇప్పుడు వాడు ఒక చెట్టు నీడలో నిలబడి అలుపు తీర్చుకుంటూండగా, వాణ్ణి, పశువుల మారుబేరగాడు కూర్మయ్య చూశాడు. కూర్మయ్య వాణ్ణి చూస్తూనే, అది తమగ్రామం ఎద్దు కాదనీ, ఎక్కడి నుంచో తప్పించుకు వచ్చిందనీ, అనుకున్నాడు.

కూర్మయ్య వృషభుణ్ణి సమీపించి, చేతికర్రతో అదిలిస్తూ, మెల్లిగా తన గొడ్ల చావిడికి తీసుకుపోయి, అక్కడ ఒక గుంజకు కట్టివేశాడు.

ఆ పగలూ, రాత్రీ వృషభుడు ఆకలికి తాళలేక, కూర్మయ్య మిగతా పశువులు



తినే ఆహారమే తినవలసి వచ్చింది. వాడికి యీ ఎద్దుబతుకు నరకంలా తోచింది.

మర్నాడు కూర్మయ్య తన ఎద్దు ఒక దానితోకలిపి, వృషభుణ్ణి బండికికట్టాడు. అయితే, వృషభుడికి పక్క ఎద్దుతోపాటు అడుగులు వేస్తూ, బండిలాగడంచేత కాలేదు. కూర్మయ్య నాలుగు రోజులు ఓపిగ్గా, తనకు దొరికిన ఎద్దుకు బండి లాగడం అలవర్చాలని చూశాడు. కాని, ఫలితం లేకపోయింది. దానితో అతడు చిరాకుపడి, వృషభుణ్ణి గంగిరెద్దుల వాళ్ళకు అమ్మచూపాడు.

వాళ్ళు వృషభుణ్ణి చూసి తృప్తిగా తలాడించి, బేరం ఖాయంచేసుకుని, కూర్మయ్యతో రేపువచ్చి, ఎద్దుకు ముక్కుతాడు వేసి తోలుకుపోతామని చెప్పి వెళ్ళారు.

ముక్కుతాడు మాట వింటూనే, వృషభుడు భయంతో వణికిపోయాడు. వాడు లోగడ గంగిరెద్దులవాళ్ళు ఎద్దులకు పెద్ద దబ్బనంతో ముక్కుకు రంధ్రం చేసి తాడువేయడం చూసి వున్నాడు. ఆ సమయంలో ఎద్దులు బాధతో ఎలా గిలగిల్లాడి పోతవో వాడెరుగు.

ఆ రాత్రి వాడు బలమంతా ఉపయోగించి కట్టుతాడు తెంచుకుని, సూర్యోదయంవేళకు గురుకులం చేరాడు.

ఆ సరికి మహాదేవశాస్త్రి రాజధాని నుంచి తిరిగివచ్చాడు. శిష్యులు ఆయనకు అడవిలో జరిగినదంతా చెప్పారు. ఎద్దు రూపంలో కళ్ళనీళ్ళు కారుస్తూ, వృషభుడు తనను సమీపించగానే, ఆయనకు వాడి మీద ఎక్కడలేని జాలీకలిగింది. ఆయన ఏదో మంత్రం పఠించి, వృషభుడికి మామూలు రూపం వచ్చేలా చేశాడు.

వృషభుడు భోరున ఏడుస్తూ, గురువు గారి పాదాలముందు పడి, ఎద్దు రూపంలో తాను పడినబాధలన్నీ చెప్పుకున్నాడు.

ఆ తరవాత వాడు, ఏనాడూ మంత్ర శాస్త్రం సంగతి ఎత్తక పోవడమేకాక, దేనికీ ఆత్రపడకుండా, ఎంతో నిగ్రహం అలవరుచు కున్నాడు.



పక్షులు – జంతువులు

# నెమలి

పింఛము విప్పిన నెమలి ఒక అద్భుతమైన దృశ్యం. నీలం, పచ్చ, బంగారు రంగులతో మగ నెమలి పింఛం, చూసేవారిని పరవసింపజేస్తుంది. కాని నెమలి కంఠస్వరం మాత్రం కఠోరంగా వుంటుంది.

ప్రాచీన కాలంనుంచే మన దేశంలోనే కాకుండా, గ్రీకు, చీనా మొదలైన దేశాలలోనూ, నెమలి పింఛాన్ని విశేషంగా అభిమానించి, అలంకారాలకు ఉపయోగించేవారు. ఆర్గాస్ రాజకుమారిని సంరక్షించడానికి, హీరా దేవత వేయి కళ్ళ నెమలిని నియోగించినట్లు ప్రాచీన గ్రీకులు భావించేవాళ్ళు. అందువల్లే వాళ్ళు నెమలిని హీరాపక్షి అనేవాళ్ళు. చైనాలో రాజులు అధికారులను సత్కరించడానికి నెమలి ఈకల విసనకర్రను బహూకరించేవారు.

బంగారంతోనూ, అపురూపమైన మణులతోనూ నిర్మించిన మొగలులనాటి నెమలి సింహాసనం జగత్ప్రసిద్ధమైనది.

ఐరోపా ఖండంలో చాలా కాలంగా ఉద్యానవనాల అలంకారంగా నెమళ్ళను పెంచుతున్నప్పటికీ, నెమలి భారతదేశం, శ్రీలంక స్వస్థలంగా గల పక్షి।

నేలమీదా, లేదా నేల దారుగా వున్న కొమ్మలమీదా, నెమళ్ళు గూళ్ళుకడతాయి. ఆడ నెమలి ఆరు గుడ్లు పెడుతుంది. రెండేళ్ళు నిండేవ్వరకు, ఆడ నెమళ్ళకూ, మగ నెమళ్ళకూ ఎలాంటి తేడా కనిపించదు. ఆపైన మగ నెమళ్ళకు అందమైన పింఛం ఏర్పడుతుంది. కొమ్మలపైన పురివిప్పి నిలబడే నెమలికన్నా, ఎగురుతూన్న నెమలి మరింత అందంగా కనిపిస్తుంది. నెమలి మన జాతీయపక్షి.





## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1985 మార్చి నెల సంచికలో ప్రకటించబడును.



Pranlal K. Patel



Anant Desai

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జనవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: లేస్తే బోయల భయం
రెండవ ఫోటో: చూస్తే బొమ్మల మయం.

పంపినవారు: కె. శ్రీధర్, నలజాలమ్మ వీధి, గూడూరు—(నెల్లూరు జిల్లా)

*బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా? సమాధానాలు:

1. శాన్‌ఫ్రాన్సిస్కో నగరంలో. 1945వ సం॥ మార్చి 25న. 2. పెషావర్ 3. పల్లవులు 4. రాజా ధిలా 5. ఆగ్రా.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# GROW UP WITH C.B.T. BOOKS













★ కథలు, చరిత్ర, విజ్ఞాన విషయాలకు సంబంధించిన బొమ్మల పుస్తకాలు

★ ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ, గుజరాతీ మరి ఇతర భారతీయ భాషలలో దాదాపు 400 పుస్తకాలు




● ఈ ప్రకటన ఉదహరిస్తూ 10% తగ్గింపు పొందండి

● ఉచిత ధరల పట్టిక కోసం రాయండి

● ప్రసిద్ధ పుస్తక విక్రేత లందరి వద్దా మా పుస్తకాలు లభిస్తాయి

Beautex-13

# CHILDREN'S BOOK TRUST

Nehru House, 4, Bahadur Shah Zafar Marg, NEW DELHI-110002

అంతా చాకొలెట్‌మయం ప్రతి ఒక్కరి ఇష్టమయం!

nutrine
chocolate
Eclairs
more milk
more butter
more chocolate











CLARION/NC/84210/